# మంజూష





(వ్యాస సంపుటి)



పడాల రామకృష్ణారెడ్డి
M. A. (Pre) PhD.



# అంకితం

సౌజన్యులు, సహృదయులు, అమృతమూర్తి, ముప్పది సంవత్సరాలు పెద్దాపురం మునిసిపాలిటీని మురిపిస్తూ పాలించిన విశిష్ట నాయకులు, నిరంతరము నాశ్రేయస్సు నభిలషించే మహామనీషి శ్రీ ముప్పన రామారావు గార్కి ఆత్మీయత, ఆప్యాయత, అనురాగములకు ప్రతీకగా అంజలి ఘటిస్తూ గౌరవ పురస్సరంగా -

పడాల రామకృష్ణారెడ్డి

# వ్యాసమాలిక

# అవతారిక

సాహిత్యంపట్ల, కళలపట్ల నాకున్న అభిరుచి, అభినివేశం వానిపై నాచే ఎన్నో వ్యాసాలు వ్రాయించాయి. ప్రముఖ దిన పత్రికలు ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, విశాలాంధ్ర, కోస్తావాణి, సమాచారం వగైరా పత్రికలు అవి ప్రకటించి సాహితీ కళారంగాలలో విమర్శకునిగా నాకోస్థానాన్ని కల్పించాయి.

అవి చదివిన పాఠకులు అందించిన ఉత్సాహ ప్రోత్సాహాలు జాతీయాచార్య డా॥ యస్. వి. జోగారావుగారి పర్యవేక్షణలో "గోదావరిసీమ జానపద కళలు, క్రీడలు, వేడుకలు" అనేపరిశోధన గ్రంథాన్ని వ్రాయించాయి Ph. D. డిగ్రీకోసం. 1989లో దాన్ని ఆంధ్రాయూనివర్సిటీ స్వీకరించింది. దీనికి ప్రేరణ మీరే – ఆ Credit మీకే దక్కుతుంది.

ప్రముఖ పత్రికలలో వచ్చిన నావిమర్శక వ్యాసాలు చాలా వరకు 'తెలుగువారి జానపదకళలు' "లలితకళలు' మొదలగు అనేక పుస్తకాలలో వచ్చాయి. పాఠకులు Hot Cakeలా వానిని అందేసుకుని నాకు యీదేశంలో ఎందరో అభిమానులున్నారనే ఆనందం కలగజేశారు.

పత్రికలలో ప్రకటింపబడికూడా సందర్భం సరిపోక ఆపుస్తకాలలో చోటుచేసుకోలేకపోయిన కొన్ని వ్యాసాలు వేరే ఒకపుస్తకం వేస్తే బాగుంటుందని పాఠకులు యిచ్చిన సలహామేరకు వానిని 'మంజూష" అని యిలా ప్రకటించాను.

ఇందులో వివిధ విషయాలపైన, విఖ్యాత వ్యక్తులపైన విమర్శ, పరామర్శ, అనుశీలన, పరిశీలన ఉంటాయి. నిజానికి యీ ప్రక్రియలన్నీ కళాభాగాలే. వీనిని అలా కళాత్మకంగానే

చూడండని వేడుకుంటున్నా - ఆంధ్రవిశ్వవిద్యాలయంలో "ఆంధ్ర భాషాసమితి" అధ్యక్షుడిగా చేసిన రెండుప్రసంగాలు కూడా యిందులో జోడించా తరువాత అధ్యక్షులయ్యే వారికి గైడ్‌లైన్స్‌గా, ఇంచుమించు యిది కలగూరగంపే - ఎవరికి ఏదియిష్టమైతే అది తీసుకుంటారని నా భావన.

భవదీయుడు

**పడాల రామకృష్ణారెడ్డి**

M. A. M. Phil,

# తెలుగు విశ్వవిద్యాలయం

ప్రొ॥ సి. నారాయణరెడ్డి
M. A. Phd. D. Litt
వైస్ ఛాన్సలర్

లలిత కళాక్షేత్రం
హైదరాబాదు
Dt. 26-2-1991

## అభినందన

నాటక కర్తగా, అనేక జానపద కళారూపాల రచయితగా శ్రీ పడాల రామకృష్ణారెడ్డి సుప్రసిద్ధుడు. రచనతోపాటు నటనలో కూడా సముచిత ప్రావీణ్యం ఉండడంవల్ల ఆయన నాటకాలు మరింత రక్తి కట్టాయి.

శ్రీ రామకృష్ణారెడ్డి అప్పుడప్పుడు రాసి వివిధ పత్రికల్లో ప్రచురించిన వ్యాసాలను "మంజూష" అనే సంపుటిగా ప్రచురిస్తున్నందుకు సంతోషం. ఇందులోని వ్యాసాలు అలవోకగా చదువుకునేవిగా వున్నాయి. ఆలోచనకు ప్రేరణ కలిగించేవిగా వున్నాయి. ఈ సంపుటిలో నామీద రాసిన వ్యాసం ఉంది. కాబట్టి ఇంతకుమించి శ్రీ రెడ్డిని ప్రశంసిస్తే ఔచిత్య పరిధి దాటినట్లు అవుతుంది.

పాటైనా మాటైనా ప్రతిభావంతంగా పలికే శ్రీ రామకృష్ణారెడ్డికి నా అభినందన.

సి. నా. రె.

# రసజ్ఞులను అలరించే అవధాన ప్రక్రియ

"కాళ్ళున్న ప్రతివాడూ నడవగలడు గానీ చేతులున్న ప్రతి వాడూ వ్రాయలేడు" అంటాడు శరత్. అలాగే నోరున్న ప్రతి వాడూ అరవగలడుగానీ నాలికున్న ప్రతివాడూ కవిత్వం చెప్పలేడు. అష్టావధానం కవికి సంబంధించిన గొప్ప ప్రక్రియ. తెలుగువారి స్వంత ప్రక్రియ.

అవధానంలో సమస్యా పూరణం వంటివి రాయల కాలంలో ప్రస్ఫుటంగా కనుపిస్తున్నాయి. "కుంజర యూధంబు దోమకుత్తుక జొచ్చెన్" వంటి సమస్యలు రాయలు ఆస్థాన కవులకు ఇవ్వడం, అవి వారు పూరించడం ఆనాటి సాహితీ చరిత్ర చదివితే తెలుస్తుంది. అంతకు ముందుకాలంలో కూడా [14వ శతాబ్దిలో] అనంతామాత్యుని 'భోజ రాజీయం'లో "కైపద మిచ్చు వారలును గ్రుక్కన పద్యము చెప్పు వారలున్" అనే పద్యముంది. కైపదమంటే కవిత్వం చెప్పడానికి యివ్వబడే పాదం అని అర్థం. దీనిని బట్టి అంతకు ముందే ఈ అవధాన ప్రక్రియ తెలుగులో ఉన్నట్టు తెలుస్తున్నది.

ఆధునిక కాలంలో మరికొన్ని అంశాలు చేర్చి అష్టావధానం చేస్తున్నారు. కింకవీంద్ర ఘంటా పంచాననులు తిరుపతి వేంకట కవులు తమ జైత్ర యాత్రతో దీనికి ప్రసిద్ధి తెచ్చారు. మాన్యశ్రీ దివాకర్ల వెంకటవధాని, నరాల రామిరెడ్డి, ఋలుసు వెంకట రామ మూర్తి, గాడేపల్లి కుక్కుటేశ్వరరావు, పేరాల భరతశర్మ, చిర్రావూరి రామశర్మ, దోర్బల ప్రభాకరశర్మ, రావూరి వెంకటేశ్వర్లు, రొంపిచర్ల శ్రీనివాసాచార్యులు, మోపిదేవి భాస్కరరావు, ప్రభల సుబ్రహ్మణ్య శర్మ మొదలైన అవధాన పండితులు ఎందరో దీన్ని సుసంపన్నం చేస్తున్నారు.

ఇది చాల క్లిష్టతరమైనది, కష్టతరమైనది. అందుకే అష్టావధానాన్ని కష్టావధానంగా పిలవటం కద్దు. అయితే ఇందులో చమత్కార పరమైన రసోద్దీపన ఉంది. ప్రేక్షకుల నలరించే గుణముంది. కాబట్టే, ఈ కళా ప్రక్రియ ఇతర రంగాలలోకి కూడా ప్రాకింది. దీన్నిబట్టే నాట్యావధానం, నేత్రావధానం, చిత్రావధానం బయలు దేరాయి. నాట్యావధానం ధారా రామనాద శాస్త్రిగారు, నేత్రావధానం జాషువా బ్రదర్సు, చిత్రావధానం బెల్లంకొండ సూర్య ప్రకాశరావు, కొండిపర్తి శేషగిరిరావుగార్లు అద్భుతంగా చేస్తూ విశిష్టులయ్యారు. మనఅష్టావధానం ఈనాడు హిందీ, సంస్కృత భాషల్లోకి కూడా వెళ్ళడం తెలుగుజాతి గర్వించ దగ్గ విషయం.

అవధానికి విశేషమైనధారణ, ఆశుకవిత్వం, చమత్కారం అతి ముఖ్యం. చమత్కారం ఎంత ఉంటే అవధానం అంత రక్తికడుతుంది. అష్టావధానానికి ఎనమండుగురు పృచ్ఛకులుంటారు. ఎనిమిది అంశాలుంటాయి. ఆయా అంశాలలో ఈ పృచ్ఛకుల ప్రశ్నలకు, సమస్యలకు అవధాని సలక్షణంగా, సంతృప్తికరంగా సమాధానాలు చెప్పాలి.

## సమస్యా పూరణం

సమస్యా పూరణం విలక్షణమైన అంశం. పద్యానికి నాలుగు పాదాలు కదా! పృచ్ఛకుడు చివరి పాదమిస్తాడు. అవధానిపై మూడు పాదాలూ దీనికి అన్వయిస్తూ పూరించాలి. పృచ్ఛకుడిచ్చే పాదంలో సాధారణంగా విరోధాభాస ముంటుంది. అంటే అందులో విరుద్ధమైన భావముంటుంది. ఉదాహరణకు "కోడిన్‌తినె బ్రాహ్మణుండు కోరిక దీరన్" అని పృచ్ఛకుడు నాలుగవ పాదం ఇచ్చాడనుకుందాం. మరి సాధారణంగా బ్రాహ్మణుడు కోడిని తినడు గదా! ఈ విషయాన్ని తొలగించి పద్యం చెప్పాలి. ఇందులోని ఆభాసాన్ని తొలగించడానికి అవధాని పద్యంలోని మూడవపాదం చివరి అక్షరం "ప" పెట్టి

కుంటాడు. దీనితో 'కోడి' "పకోడి" అవుతుంది. అలాగే పదాన్ని విరిచి కొత్త అర్థాలు స్ఫురింపజేసి ఆభాసాన్ని తొలగించి రంజింప జేస్తారు.

## దత్తపది

దత్తపది కూడా ఇంచుమించు అలాంటిదే. అసందర్భమైన ఏవో పదాలు నాలుగు ఇస్తారు. ఈ నాలుగు పదాలూ నాలుగు పాదాల్లోనూ ఇమిడ్చి రామాయణ పరంగానో, భారత పరంగానో, మరోదాని పరంగానో అన్వయించి చెప్పమంటారు. శివశ్రీ నూతికట్టు కోటయ్యగారు రాకెట్టు, సాకెట్టు, పోకెట్టు, సిగరెట్టు అనే నాలుగు ఆంగ్ల పదాలను తెలుగులోకి సరిపెట్టుకుని రామాయణ పరంగా పద్యం ఎంత హృద్యంగా చెప్పారో చూడండి. అడవిలో రాముణ్ణి చూసిన మాయలేడి యిలా తలచిందట.

"ఇనకులుండు నన్ బట్ట రాకెట్టులుండు
ససిగరెట్టుగ రోసాన విశిఖ మేయు
కెట్టులుండు, నా ప్రాణి పోకెట్టులుండు
ఇపుడు తప్పుకో నాకు సాకెట్టులుండు"

## నిషిద్ధాక్షరి

నిషిద్ధాక్షరిలో పద్యం ఏ విషయం మీద చెప్పాలో ఇస్తారు. సాధారణంగా మొదటి రెండు పాదాల్లోనూ ప్రతి రెండవ అక్షరాన్నీ నిషేధిస్తుంటాడు పృచ్ఛకుడు. ఉదాహరణకు రాముడు మీద పద్యం చెప్పమన్నారనుకోండి, అవధాని "రా" అని మొదటి అక్షరం వేస్తాడు. దానితో రెండవ అక్షరం "మ" వేస్తాడని మనకు తెలుస్తోంది. వెంటనే పృచ్ఛకుడు "మ" వెయ్యరాదని నిషేధిస్తాడు. అప్పుడు అవధాని "ఘ" వేస్తాడు. మూడవ అక్షరం అవధానిదే గనుక "వ" వేసుకుంటాడు. "రామ"కు బదులు 'రాఘవ' పడింది. అర్థం అదే. బహుశః

ఈ అక్షరం వేస్తాడు అనుకున్న ప్రతి అక్షరాన్నీ నిషేధిస్తుంటాడు పృచ్ఛకుడు. దీనికి చాలా భాషాధికారం కావాలి యిద్దరికీ కూడా. అప్పుడే దానిలో మజా.

## చిత్రాక్షరి

చిత్రాక్షరికి పృచ్ఛకుడు కాగితం మీద 32 గడులు గీసిపెట్టుకుంటాడు. దేవుని పేరో, దేవత పేరో చెప్పి ఆ పరంగా 32 అక్షరాలతో ఒక శ్లోకం చెప్పమంటాడు. అందులో చిత్రం-ఫలానా గడిలో అక్షరం చెప్పండి అని అక్కడక్కడ అక్షరాలు అస్తవ్యస్తంగా అడుగుతూ ఆ చెప్పిన అక్షరాలను ఆయా గడుల్లో వ్రాసుకుంటుంటాడు పృచ్ఛకుడు. ఒకసారి 17వ గడి అక్షరం అడిగితే ఇంకోసారి 4వ గడిలోది, మరోసారి 13వ గడిలోది - అలా యిష్టం వచ్చినట్టు అడుగుతుంటాడు. ముప్పది రెండు అక్షరాలూ కూడా ఆఖరున చూస్తే ఇచ్చిన విషయానికి అన్వయించి అది శ్లోక మవ్వాలి. కొంతమంది దీనికి బదులు న్యస్తాక్షరి చేస్తుంటారు. అంటే ఒక పద్యపాదంలోని అక్షరాలు ఒక్కొక్కటి చొప్పన ముక్కలుగా చించి అప్పుడప్పుడు యిన్నో అక్షరం ఫలానా అని ఒక్కొక్క అక్షరం అపసవ్యంగా ఇస్తుంటారు. అవధాని అవన్నీ గుర్తు పెట్టుకుని ఆఖరున ఆ పాదం సవ్యంగా సక్రమంగా చెప్పాలి.

## తేదీలు

పృచ్ఛకుడు ఏదైనా ఒక తేదీ చెబితే అవధాని ఆ వారం పేరు చెబుతాడు. ఉదాహరణకి 1-5-48 ఏరోజు అంటే శనివారం అని కరక్టుగా చెబుతాడు. అవి ప్రస్తుత సంవత్సరం తాలూకువైనా సరే, గతించిన సంవత్సరాల తాలూకువైనా సరే, రాబోయే సంవత్సరాల తాలూకువైనా సరే. ఈ తేదీలు ఒక్క పృచ్ఛకుచే తనే కాకుండా ప్రేక్షకులనుండి కూడా స్వీకరిస్తుంటారు. సాధారణంగా తాము పుట్టిన తేదీ ఏ వారమో ఎవరిది వారికి తెలిసుంటుంది. గనుక ప్రేక్షకులు తమ

పుట్టిన తేదీలు ఇస్తుంటారు వారం చెప్పమని.

## ఆశువు

పృచ్ఛకుడు ఒక విషయం ఇచ్చి ఆశువుగా కవిత్వం చెప్పమంటాడు లేదా వర్ణించమంటాడు. ఉదాహరణకు ఈ సభను వర్ణించండి అంటే ఆశువుగా 3, 4 పద్యాలలో ఆ సభను వర్ణిస్తుంటారు. అలాగే ఏ విషయం ఇచ్చినా కూడా అవధానం పూర్తయేలోగా 5, 6 పద్యాలు చెబుతారు.

## ఘంటాగణనం

అవధాని మంచి మూడ్‌లో ఉన్నప్పుడు అప్పుడప్పుడు ఒకో గంట కొడుతుంటారు. అవి ఎన్ని కొట్టారో ఆఖరున అవధాని ఖచ్చితంగా చెప్పాలి. ఈ గంటకు బదులు కొందరు 'చదరంగం' పెడుతుంటారు. కొందరు పూలగణనం పెడుతుంటారు. పూలగణనం అంటే ఒకరు అవధాని మీద అప్పుడప్పుడు పూలు వేస్తుంటారు. ఆఖరున అవధాని ఆ వేసిన పూలెన్నో చెప్పాలి.

## అప్రస్తుత ప్రసంగం

అవధాని యొక్క శ్రద్ధని, ధారణని గత్తర చేసి అసలు విషయాన్ని మరచిపోయేలా హాస్య చమత్కార సంభాషణలతో అవధానాన్ని పాడుచెయ్యడానికి ప్రయత్నం చేసే కామెడీ విలన్ ఈ పృచ్ఛకుడు. అప్రస్తుతమైన సినీమాల గురించీ, మోళీల గురించీ, లోక వ్యవహారాల గురించీ, రాజకీయాల గురించీ ఇతడు వేసే ప్రశ్నలు ప్రేక్షకులకు పెద్ద రిలీఫ్, అవధానికి గజిబిజి. ఈ పృచ్ఛకుడు ఎంత చమత్కారంగా అడుగుతాడో అంతకుమించిన చమత్కార చాతుర్యంతో సమాధానాలు పద్యాలలోను, మాటలలోను చెప్పి ప్రజలను ముగ్ధుల్ని చేస్తుంటాడు అవధాని.

పూర్వం ఈ అవధాన ప్రక్రియ పండిత ప్రేక్షకులకే పరిమితమై ఉండేది. ఇప్పుడు పండిత పామర జనరంజకంగా కూడా చేస్తున్నారు. ఈ ప్రక్రియా వైశిష్ట్యాన్ని నేటి యువతరానికి తెలియ జెయ్యడం కోసం రాజమహేంద్రవర "సారస్వత సమితి" తమ వసంతోత్స వాలలో ఇటీవల అవధాన సప్తాహం అనే సాహితీ యజ్ఞాన్ని తలపెట్టడం ముదావహం. మరుగుపడి పోతున్న ఇలాంటి తెలుగు సాహితీ కళా కృతులకు ప్రోత్సాహమిచ్చి పునరుజ్జీవింప చెయ్యడం తెలుగుదేశం ధ్యేయం కావాలి.

— కోస్తావాణి

(1983 జూన్ 12వ తేదీ పత్రిక నుండి)



# నన్నయ ఆత్మ విచారం

ఉ॥ ఎవ్వరివయ్య నీవు యిపుడేమిటి చెప్పగ వచ్చినావు యీ
దవ్వుల నేమికావలయు దబ్బున పల్కుము బ్రాహ్మణోత్తమా
అవ్వల నన్నపార్య సభ కాదర మొప్పగఁబోవుచుంటి న
న్నివ్విధి చేయిపట్టుకొని నిల్పితి వెందుకు వేగతెల్పుమా!

అనగా ఆగంతకుండు తానే నన్నయ నని తెలుప, సంభ్రమాశ్చర్యంబులు ముప్పిరిగొన, రెండు చేతులూ జోడించి, మహాత్మా! క్షమింపుడు. నేడు మీ చిత్రపటములు అందరూ తలొక విధముగా వ్రాయుచుంట జేసి, మీరు స్వయముగా వచ్చి ఎదుట నిలిచి నన్నే నేనే అని చెప్పుకున్నగాని మిమ్ము గుర్తింప లేకపోతిని. అట్లే మీ భారతావతారికలోని పద్య భావములు పలువురు పలు విధములుగా చెప్పుచుంట మీ ఆత్మను కూడ గ్రహించలేక సతమత మగుచున్నాము. ముందు, మీరువచ్చిన కారణము తెలిపిన అనంతరము, నా సందేహముల మీ ముందుం చెద – అని వేడు కొనగా, "అక్కడ నాకు సహస్రాబ్దికం పెట్టు చున్నారనీ, నీవు కూడా సాహితీ కృషీవలుడవనీ, నా సహస్రాబ్ది ఉత్సవాల నిర్వహణ కుత్సాహ పడిన వాడివనీ, మొన్న 'పురిపండ' నా వద్దకువచ్చి చెప్పగా, నా గురించి మీ అవగాహన తెలుసు కుందామని వచ్చేను. ఇక నీ సందేహాలు ప్రారంభించు"–

స్వామీ! భారతావతారిక మీరే వ్రాశారా?.........?.........? ఈ సందేహ మెందుకు కలిగిందంటే అందులో రాజరాజ నరేంద్రుని గూర్చి మీ పొగడ్తలు చరిత్ర పరంగా చూస్తే చాలా అతిశయోక్తులుగా కనుపిస్తున్నాయి. మిమ్మల్ని గురించి వ్రాసినదానిలో కూడ "సత్ప్రతిభాభియోగ్య" "నిత్య సత్యవచన" "మత్యమరాధిపాచార్య" అని మీకు మీరే వ్రాసుకుని ఉంటారంటే నమ్మబుద్ధి కావడంలేదు. అందు ప్రత్యేకించి 'మత్యమరాధిపాచార్య' అని

(మతి + అమర + అధిప + ఆచార్య) మీకు మీరే బృహస్పతి అంతటి వాడినని వ్రాసేసు కుంటారంటే అసలే నమ్మ లేకుండా ఉన్నాను. కారణం – 'శిశుపాలవధ'లో మీరే వ్రాశారు – "అన్యకీర్తనంబు నన్య నిందయుఁదన్ను,ఁబరగఁబొగడికోలుఁబ్రిబ్బికోలు, నాపగా తనూజ యార్య వృత్తములుగా, వనిరి వీని వాద్యులయిన మునులు" అనీ తప్పిన్నంగా మీరే అలా పొగుడు కుంటారా అని!

ఇక 'సారమతిన్ కవీంద్రులు' అనే పద్యాన్ని మా పండితు లంతా పీకిపీకి లాగిలాగి ఎవళ్ళకి తోచినట్లు వాళ్ళు చెప్పేయడంతో మాకు అసలు విషయం అయోమయమయి పోయింది. అ తారికలో మీ గూర్చి "లోకజ్ఞు" "నానా పురాణ విజ్ఞాన నిరతుపాత్రు" అని వ్రాయబడి ఉండడంవల్లా, భారత రచనలో మీరు ప్రదర్శించిన తేట తెల్లమైన తీరువల్లా మీరు మెలికల మనిషికాదని, విషయాన్ని సూటిగా చెప్పేఉత్తమ పౌరాణికులని నేను అవగాహన చేసుకున్నాను. కాబట్టి మీరు అందులో మా పండితులు తర్క వితర్కాలు చేసి చెబు తున్న విపరీతార్థాలూ, గూఢార్థాలూ పెట్టి ఉంటారనీ అనుకోవడంలేదు. "సారమతిన్ కవీంద్రులు ప్రసన్న కథా కవితార్థ యుక్తిలోనారసి మేలునాన్, ఇతరులక్షర రమ్యత నాదరింప" అంటే మీ దృష్టిలో ప్రసన్న కథా కవితార్థ యుక్తి అనేది మీ కవితా లక్షణమనీ, కవి హృదయం కవులకే తెలుస్తుంది గనుక మేధావులైన కవులు మీ కావ్యంలో యిమిడ్చిన యీ కవితా సౌరభాన్ని శోధించి ఆహ! అని ఆనందిస్తారనీ, ఇతర పాఠకులు యిందులోని అక్షర రమ్యతను ఆదరిస్తారనీ మీ ఆత్మగా నేను భావిస్తున్నాను. ఇక్కడ అక్షర రమ్యత అంటే అక్షరాల కూర్పు అనిగాని, అక్షరాలు వ్రాయడంలోని నేర్పు అనిగాని, గణాలు పేర్చడంలోని తీర్పు అనిగాని గాక, 'అక్షరము' అనగా 'క్షరముకాని' అని అర్థం తీసుకుంటే 'నాశముకాని రమ్యత' అని అర్థం వస్తుంది. సంస్కృత భారతంలో వున్న గజిబిజి తొలగించి

సరళ సుందరంగా కథలు దృశ్య సాక్షాత్కారంతోను, నాటకీయంగాను మలిచి చెప్పడంవల్ల జనించిన అజరామరమైన రమ్యత సామాన్య పాఠకులను సహితం ఆకర్షించి వారు కూడా ఆదరిస్తారని మీ ఉద్దేశం అని నా అభిప్రాయం.

నాకు మరో పెద్ద సందేహం వచ్చిపడిపోయింది. తిక్కనగారు "ఆది దొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు విద్యా దయితుండొనర్చె మహిత్మాతుడు నన్నయ భట్టు దక్షతన్" అన్నాడు. 18 పర్వాలలోను మొదటి మూడు పర్వాలు మీరు వ్రాశారనీ, నాలుగవదైన విరాట పర్వంనుండి 15 పర్వాలు తను చేశానని అన్నాడు. మా పెద్దలు ఆది సభా పర్వాలు, అరణ్య పర్వంలో 4వ ఆశ్వాసంలో 142వ పద్యంవరకే మీదంటున్నారు. మరి తిక్కనగారి మాట నిజమా – తక్కిన వాళ్ళ మాట నిజమా!

అవతారికలో మిమ్ము గురించి 'విపుల శబ్దశాసనుడు' అని వుంది. దీనికి నేననుకునేది అనాడు తెలుగు భాషకు కావ్యం వ్రాయ డానికి కావలసినంత శబ్దజాలం లేక వేలాది సంస్కృత పదములకు తెలుగులో తత్సమాలు, తద్భవాలు ఏరి పేర్చి కూర్చి తీర్చిఆరీతిని వ్యాకరణ రూపంలో (ఆంధ్ర శబ్ద చింతామణిలో) నిబంధించి, శాసించి భారత కావ్యంలో పొందుపరచారనీ, అందువల్ల మిమ్ము విపుల శబ్దశాసనుడన్నారనీ నా ఊహ. – మరి యీమధ్య కొందరు ఆంధ్ర శబ్ద చింతామణి మీరు వ్రాయ లేదంటున్నారేమిటి!

మీ పేరు చెప్పడం తడవుగా మా పండితులు మీ వందలాది పద్యాలు గడగడా ఒప్పగించెయ్యడం పనిగా పెట్టుకున్నారు. దీనితో ప్రజల్లో మీకు ప్రత్యేకించి పద్యకవిగానే ముద్రపడిపోయింది. నిజానికి మీరు భారతంలో పద్యం ఎంత హృద్యంగా వ్రాశారో గద్యం కూడా అంత 'మనోజ్ఞంగానూ వ్రాశారు. నన్నయనుండి

చిన్నయ వరకూ (చిన్నయ సూరివరకూ) నడిచిన వచనానికి మీదేగా ఒరవడి! అటువంటప్పుడు మీ వచన భాగాన్ని విస్మరించడం చోద్యంగా లేదూ!

మీరు కన్నడిగులని కొందరూ, కాదు కాదు తెలుగు వారే అని కొందరూ యిప్పుడు సిగపట్లకు దిగుతున్నారు. అసలు మీరెవరో కాస్త చెప్పేస్తే మా బాధ తీరిపోతుంది, అనగానే ఆయన ఫక్కున నవ్వి, "ఇంతకూ యివియా మీ ఆలోచనలు! నేను భారతం ప్రారంభించింది యిలాంటి చర్చలకోసం కాదు - జగద్ధితము కొఱకు - (నన్నయ భట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్) - అసలు విషయం విడిచి యిలాంటి చర్చలా నాకు సంస్మరణ! నాలాగే ఏదైనా ఒక జగద్ధిత కార్యము చేబడితే అదినాకు సంస్మరణ అవుతుందిగాని ఇలాంటి వానివల్లకాదు."

అందువల్లే మీ ఉత్సవాల ఖర్చుమిగిల్చి మంచినీటికి కటకటలాడుతున్న ప్రాంతాలలో వాటర్ సప్లయి స్కీములు లాంటివి పెట్టి దానికి మీ పేరు పెడదామను కుంటున్నారట - మీకివి జగద్ధితకావ్యం అయితే ఇది జగద్ధితకార్యం అన్నాను - "మంచిది" అని మళ్ళీ మాట్లాడకుండా సభలకు రాకుండానే నన్నయగారు అదృశ్యమై వెళ్ళిపోయారు. నేను సాదృశ్యంగా యీ విషయం సభలో చెప్పాలని లేచి, గొంతు సవరించుకొని, సోదర సోదరీ మణులారా! అనగానే ఏవిట్రా ఆ పలవరింతలు! బారెడు ప్రొద్దెక్కిందిలే" అన్న మా అమ్మ కేకకు తుళ్ళిపడి లేచా నిద్రలోంచి.

— కోస్తావాణి
(1985 మే 13, 14 తేదీలు)

II

# నటేశం నిరుద్యోగోపన్యాసం

"ఈనాడు నిరుద్యోగ సమస్యతో నిజంగా నలిగి పోతున్నది విద్యార్థిలోకం. ప్రతీ సంవత్సరం పరీక్షలో ఇది ఎక్స్పెక్టెడ్ క్వెశ్చనే. దీనికి ఆన్సరు పిప్పిపేరు చేసుకోవడం, బట్టీ పట్టడం పెద్ద సమస్య. అందుకే అడే పాడే చిరు వయస్సులో ఇలాంటి జటిల సమస్యలలో బుర్ర పెట్టమని బాధించడం విద్యా శాఖాధికారుల దారుణ నిరంకుశ చర్య అంటాను. దీని మీద ఒక ఆందోళన లేవదీయాలి" అన్నాడు నటేశం ఆవేశంగా. విద్యార్థులు తెగ బాదేశారు బల్లలు. చప్పట్లు మారుమోగి పోయాయి. (అవి గిరీశం అరేంజి చేశాడంటారనుకోండి అతని అపోజిషన్ వాళ్ళు) నటేశం గిరీశం క్లాసుమేటు. (గ్లాసుమేటు కూడా) అది ఒక విద్యాలయం. (ఇక్కడ "లయం" అంటే "నాశనము" అని ఎవరైనా అర్థం తీసుకుంటే ఆ తప్పునాది కాదు, నిఘంటువుది మా త్రమే.) ఆ విద్యాలయంలో అది నిరుద్యోగ సమస్య మీద సాగుతున్న చర్చావేదిక. లెక్చరర్ చక్రం అధ్యక్షుడుగా రెండవరోజు చర్చలో నటేశం ఉపన్యాసం మంచి రంజుగా సాగుతోంది.

"ఇకపోతే, ఈ సమస్యతో సతమత మౌతున్న రెండవ వాడు రాజకీయవేత్త. ఎన్నికలలో నిరుద్యోగం మీద గొంతు పగిలేలా అరిస్తేగాని ఓట్లు పడవుగదా! (ఈ దేశంలో నిరుద్యోగుల ఓట్లే ఎక్కువ గనుక.) అలా అరిచేటప్పుడు గొంతునొప్పి పుడుతుంది. బల్ల గుద్దితే చేతికి దెబ్బ తగులుతుంది, ఓడిపోతే నిరుద్యోగం తనకి కూడా ఎదు రౌతుంది. ఇదీ అవస్థ. పోతే, అదృష్టం బాగుండి నెగ్గేసి మంత్రి కూడా అయిపోయి ఈ సమస్యా పరిష్కారానికి ఆలోచించాడనుకోండి బుర్ర వేడెక్కడం, వెంట్రుకలు రాలిపోవడం. (అయితే ఈ సమస్యమీదే నెగ్గి పైకొచ్చి నవాడు గనుక మాతృద్రోహం చెయ్యలేక దాన్ని అడవి తుప్పలా ఎదగమని గాలికి వదిలేశాడనుకోండి, అది వేరే సంగతి.)

సరే ఇక అసలు విషయానికి వస్తే ఈ సమస్యతో అచ్చంగా బాధపడేది అసలు సిసలు నిరుద్యోగి. యిప్పుడీ సమస్య అర్జంటుగా మరీ పెద్దదై పోయింది – ప్రపంచమంతా. దీనికి కారణం జవాభా పెరిగిపోవడం అంటున్నారు. నిజమే మరి. భారతదేశంలో నిముషానికి నలుగురు పుడుతున్నారట. అంటే గంటకు 240 మంది, రోజుకు ఆరు వేల మంది, నెలకు రెండు లక్షల మంది, సంవత్సరానికి ఇరవై నాలుగు లక్షల మంది. మరి పూర్వంలా చావులులేవు కదా! పూర్వం సరియైన మందులూ మాకులూ లేక రోగాలతో పసితనంలోనే చాల మంది చచ్చిపోయే వారు. ఆపైన రాజులు ఒకరిపై ఒకరు యుద్ధాలూ, దండయాత్రలూ చేసికొని చాలమందిని చంపేసుకొనే వారు. మిగిలిన జనాభాకు ఉన్న భూములూ, పంటలూ పుష్కలంగా సరిపోయేవి. ఇప్పుడా! యుద్ధాల్లేవు. సైన్సు డెవలప్ అయిపోయి శిశు మరణాలు తగ్గిపోయాయి. అందుకే ఇండియన్ ఏవరేజి 25 నుంచి 50కి ఎదిగి పోయిందట. ఈ అభివృద్ధిని చూసి సంతోషిద్దామా, నిరుద్యోగ సమస్యను చూసి విచారిద్దామా?

నిన్న మనవాళ్ళెవో కొన్ని రెక్కలు చెప్పారు మేధావులు చెప్పారని. ప్రస్తుతం పది వేల మిలియన్ల ప్రొడక్టివిటీకి అవకాశం ఉండగా మూడు వేలకు మాత్రమే పని దొరుకుతోందట. ఇది వాస్తవ మైతే కావచ్చుగాని జనరల్‌గా మేధావుల లెక్కలంటే కొంచెం ఆలోచించాలట. ఒకసారి ఒక పెద్ద మనిషి ఒక విషయం చెప్పాడు. గవర్నమెంటు ఒక ఊళ్ళో ఎన్ని కంపోస్టు పిట్లున్నాయని సమాచారం అడిగింది. ఆ ఊళ్ళో వాస్తవంగా ఉన్నవి ఆరు. అయినా ఆ డిమానుస్ట్రేటరుగారు గవర్నమెంటు అడిగినప్పుడు తక్కువ చెబితే తగవు వస్తుందని ప్రక్కన సున్నా చేర్చి డి.ఎ ఓ. ద్వారా పంపించారట. ఆ డిస్ట్రిక్ట్ అగ్రికల్చర్ ఆఫీసరుగారు ఆ ఫైలు చూసి యీ డిమానుస్ట్రేటరుకు బొత్తిగా బుద్ధి లేదు, అడిగింది నేననుకున్నాడు

కాబోలు అరవై పంపించాడని ఆ ప్రక్కన మరో సున్నా చేర్చాడట. ఇది కలెక్టరాఫీసు వాళ్ళు చూసి మరీ యిది "అగ్గికల్చర్" డిపార్టు మెంటని విసుక్కుని ప్రక్క మరోసున్న చేర్చి పైకి పంపించేశారట. దీనితో గవర్నమెంటు అదిరిపోయి ఆ వూరికి కంపోస్టు తయారీకి ఫస్టు ప్రైజ్ యిచ్చేశారట ఇంతవరకూ బాగానే ఉంది గాని ఊరంతా గోతులే అయితే ఊరెక్కడున్నట్టూ అని!

ఇది అగ్రికల్చర్ డిపార్టుమెంటు వాళ్ళతో తగువెట్టుకున్న వాడెవడో కల్పించిన కట్టు కథ కావచ్చు కాని కథ మలిచిన తీరుకు అభినందించాల్సిందే.

మనవాళ్ళు చెప్పిన మరో పాయింటేమిటంటే ఎన్నోవేల మంది ఇంజనీర్లూ, డాక్టర్లూ నిరుద్యోగులుగా ఉండిపోతున్నారు అని. దీని కోసం మనం అంతగా ఆలోచించవలసినపనిలేదేమో అనుకుంటున్నాను. ఎందుకంటే ఈ రోజుల్లో అవి రెండూ చదివేవాళ్ళు డెఫినెట్ గా శ్రీమంతుల పిల్లలే అయ్యుంటారు. బోల్డు డొనేషన్లూ, బోల్డు ఫీజులూ కట్టగల స్తోమత పేదవాడికెక్కడొస్తుంది! ఆ పెద్ద వాళ్ళ పిల్లలు చదవడంలో కూడా మొదటి "ఎయిమ్" కట్నం-రెండవది ఉద్యోగం. పాస్ కాగానే, లేదా చదువుతుండగానే పెద్ద కట్నంతో పెళ్ళి ఎలాగా అయిపోతుంది. ఉద్యోగం లేకున్నా కొంపేం మునిగిపోదు.

ఇక మనం ఆలోచించవలసింది నిరుపేదల్లో నిరుద్యోగ సమస్య ఎలాగా అనేది మాత్రమే. నేనొక చోటా సూడోలిటరరీ రాజకీయ నాయకుడిని అడిగా రష్యా చైనాల పరిస్థితి ఏమిటని. ఆయన శ్రీశ్రీ గారి గీతం ఒప్పగించాడు. "ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరు లారా చావండి" అని. ఆ దేశాల్లో ముసలాళ్ళందర్నీ చంపేస్తారో ఏమిటో మరి! ఇది తలచుకుంటే నాకు ఒక సంగతి గుర్తుకు వస్తోంది. మొన్న సంక్రాంతి పండుగనాడు మా వూరు ఓ పోలీ

సొచ్చాడు లాఠీ కత్రి ఊపుకుంటూ. యాభై ఏళ్ళు దాటిన ముస లాళ్ళనీ, సోమరిపోతుల్నీ పట్టుకొని నిలువులోతు గొయ్యి తీసి కప్పె ట్టెయ్యమని గవర్నమెంటు తనని పంపించారనీ, ఆర్డరయిపోయిం దనీ అన్నాడు. మన దేశంలో ఆహార సమస్యను ఇలా పరిష్కరిస్తు న్నారేమో అనుకున్నాను. కాని యిన్నీ చెప్పి అఖరున ఆ పోలీసు జోలి చాపి బియ్యం వెయ్యమంటుంటే అప్పుడర్థమయింది అతను పగటి వేషగాడని. ఈ దేశంలో అడుక్కుతినడమంత సుఖమైన ఉద్యోగం మరొకటి లేదు. నడిరోడ్డు మీద పుల్లిస్తరాకుల దగ్గర ఎంగిలి మెతుకులకోసం కుక్కలతో పోరాడుతున్న మనిషిని చూస్తేనాకు చాలాజాలీ, విచారంకలుగుతాయి. కాని మొన్న నెవరో చెప్పారు అవి వాడికి వ్యాపార మట, అవి తిరిగి అమ్ముకుంటాడట ఇంకా పేద వాళ్ళకి. పోనీలెండి ఏదో నిరుద్యోగ సమస్యా నివారణం" అని ఓ గుక్కెడు మంచినీళ్ళు త్రాగి మళ్ళీ ప్రారంభించాడు నటేశం.

"ఈ నిరుద్యోగ సమస్యను నిర్మూలించడానికి ప్రభుత్వం ఏమీ చెయ్యడం లేనట్టు మన వాళ్ళు చెప్పినదానితో నేను ఏకీభవించడం లేదు, జనాభా నరికట్టడానికి కుటుంబ నియంత్రణ అమలు చేస్తున్నారు కదా! అయితే ఇప్పుడొక పెద్ద చిక్కు వచ్చి పడిపోయిందట సాము ద్రికులకు. ఇంతక్రితం అరచేతిలోని మేరేజిలైన్ మీది రేఖలు చూసి పిల్లలెంతమందో చెప్పేవాళ్ళట అయిదో ఆరో తొమ్మిదో పదో అని. ఇప్పుడు మధ్యలో ఆపరేషన్ అయిపోతోంది రెండు లేక మూడు దగ్గర. మరి తతిమ్మావాళ్ళ సంగతి ఏమి చెప్పాలి? (యింతకిృతం ఏదో కరెక్టుగా చెప్పేసినట్టు!) పూర్వం ఒకరకం హస్తాలవారికి పిల్లల్ని చెప్పొద్దని చెప్పేరట శాస్త్రంలో. కారణం – వాళ్ళకి యింట్లోనూ వీధి లోనూ లెక్క తేలదు గనుక. యిప్పుడిక ఎవ్వరికీ చెప్పడానికి లేకుండా పోయిందట పాపం.

ఇక రెండవది, నిరుద్యోగులంటే ఒక్క చదువుకున్నవాళ్ళలో

నిరుద్యోగు లేనా, చదువుకోని వాళ్ళలో నిరుద్యోగం గురించి మాటా డరేం అని మీరడగొచ్చు. వారికి కూడా వేలాది పదవులు క్రియేట్ కాబడ్డాయిగా! ఎలక్టెడ్ పదవులూ, నామినేటెడ్ పదవులూ బోలెడంత జీతాలతో, బోలెడు అధికారాలతో, మరి దానిలో కూడా విద్యావంతులు లేరా అంటే అది విద్యావంతులు చేస్తున్నదురా క్రిమణ అంటాను. పాపం వాళ్ళని అమాయకుల్ని చేసి ఈ ఎడ్యుకేటెడ్‌వాళ్ళు వాళ్ళ పొట్టల్ని దోచుకుంటున్నారు. అందుకే వాళ్ళకి 100 శాతం రిజర్వేషను చట్టపరంగా ఏర్పాటు చేసి వాళ్ళ హక్కులను రక్షించాలంటాను. చదువుకోని వాళ్ళకి అధికార పదవులేమిటని అడుగుతారేమో! దీన్ని గురించి ఆ మధ్య ఆంధ్రపత్రిక వీక్లిలోమహేష్ అనే ఒకాయన "ముగ్గురు మూర్ఖుల్లో" ఓ కథ చెప్పాడు.

పూర్వం శివానందయ్యగారని ఒక గురువుగారుండేవారట – వారికి అచ్చం పరమానందయ్య శిష్యుల్లాంటి శిష్యులుండే వారట. వాళ్ళు ఎన్నాళ్ళు చదివినా ఏమీ అబ్బడం లేదట. ఇక లాభం లేదని ఒక రోజున గురువుగారిని అడిగారు శివుడెక్కడుంటాడో చెప్పమని. ఆ గురువు హిమాలయ పర్వతాల్లో కైలాసగిరి వుంది, ఆ వెండి కొండ మీద వుంటాడు అని చెప్పాడట. అప్పుడు వాళ్ళు శివుణ్ణి చూడ్డానికి ప్రయాణమై వెళుతుంటే దారిలో ఒక సందేహం వచ్చింది శివుడు కనిపించి ఏంకావాలి అని అడిగితే ఏంచెప్పాలి అని అందరూ ఆలో చించి మనకు లేనివి చదువు, సంస్కారమే గనుక అవి ఇమ్మని అడుగుదామనీ, అయితే అందరూ చదువూ సంస్కారం అనే పొడుగు వాక్యం పలకడం కష్టంగనుక కొందరు చదువు, కొందరు సంస్కారం అందామని నిర్ణయించుకున్నారు. సరే వాళ్ళకి కైలాసగిరి దగ్గర శివుడు కనుపించి వీళ్ళను కున్నట్టే ఏంకావాలి అన్నాడట. అప్పుడు మొదటి జట్టు చదువు అనే మాట గుర్తురాక 'అది' 'అది' అని బుర్ర గోక్కుంటున్నారట. రెండవజట్టు సంస్కారంలో "సం" మరచిపోయి

కారం కారం అంటున్నారట. శివుడు ఆ రెండు పదాలూ కలిపి అధికారం కావాలంటున్నారనుకొని యిచ్చాను పొమ్మన్నాడట. ఇది తెలిసి శివానందయ్యగారు పరుగెత్తుకు వెళ్ళి అయ్యబాబోయ్, డొక్క చింపితే అక్షరం ముక్కరాదు వీళ్ళకధికారం ఇచ్చారేమిటంటే, దానికి పరమేశ్వరుడు అది ఇప్పుడు కాదు, కలికాలంలో భారత దేశంలో బ్రిటిష్ వాళ్ళు రెండువందల సంవత్సరాలు పరిపాలించి వెళ్ళి పోయిన తరవాత అప్పుడొస్తుందక్కడ వీళ్ళకి అని సవరించాడట.

(ఇదేదో చమత్కారం కోసం చెప్పిన కథలా గుందే తప్ప చదువుకోని వాళ్ళల్లో మాత్రం చక్కగా పరిపాలించే వాళ్ళు ఎంత మంది లేరు!)

మూడవదేమిటంటే ఇంజనీర్లూ, కాంట్రాక్టర్లూ కలిసిపోయి నిర్మిస్తున్న కట్టడాలు. ఆమధ్య ఎవరో చెబుతుంటే విన్నా ఎక్కడో ఓ డాం కట్టారట. మంత్రిగారు ప్రారంభోత్సవం చేసి నీళ్ళొదిలారట. ఆ నీళ్ళతో పాటు డాం కూడా కొట్టుకుపోయిందట. ఇలా వెంటనే కూలి పోయేలా కట్టడంలో కూడా ఓ పరమార్థం ఇమిడి ఉందన్నాడో ఫ్రెండు. ఏమిటంటే ఆ కట్టడాలు అన్నీ అలా ఉండిపోతే కంట్రాక్టర్లూ, ఇంజనీర్లూ, కూలీలూ మరి పనుల్లేక నిరుద్యోగులై పోరూ! అందుకే కట్టడం, పడిపోవడం, మరల కట్టడం యివన్నీ చాలవరకు నిరుద్యోగ నివారణ పథకాల్లో భాగాలేన.. (ఇది నిజమైయుండదులెండి కక్షకొద్దీ ప్రతిపక్షం వాళ్ళు చెప్పే మాటలివి.)

ఇక చివరగా "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను" అన్నట్టుగా ఈ నిరుద్యోగ సమస్యా నిర్మూలనకు నేను కూడా కొన్ని సూచనలు చేస్తున్నాను.

మనం కూడా గడ్డి, ఆకులు, అలములు తినడం అలవాటు

చేసుకోవాలి. గడ్డి తినడానికి మనవాళ్ళెప్పుడో అలవాటు పద్దారను కోండి-చాలమంది గడ్డితినే పెద్ద వాళ్ళయ్యారట. ఈ మధ్య ఒకాయన పశువులకు గడ్డి దొరకడం లేదంటే మనుషులు గడ్డి తినడం ఎక్కువై పోయినందువల్ల అన్నాడు.

ఉద్యోగం పురుష లక్షణం అన్నారు గనుక ఆడవాళ్ళు మామూలుగా ఉద్యోగాలు మానేసి వంట గదుల్లోకి పోయి వంట చెయ్యాలి-మగాళ్ళు మాత్రమే ఉద్యోగం చెయ్యాలి." అనగానే, "నోనోనోనో"అని లేడీ స్టూడెంట్సు అరవసాగారు. "అయితే పోనీ ఆడ వాళ్ళు ఉద్యోగాలు చేసి మగవాళ్ళంతా వంట గదుల్లోకి వెళ్ళి వంటలు చెయ్యాలి" అన్నాను. వెంటనే మగవాళ్ళంతా"నోనోనోనో"అని కేక లేయసాగారు. అప్పుడు నటేశం ఆగండాగండని "రాజీ మార్గంగా నా బుర్రకో బ్రహ్మాండమైన ఐడియా వచ్చింది. దేశంలో నిరుద్యోగిగా ఎవ్వరూ మిగలకుండా ఉండాలంటే ఇప్పుడున్నట్టు రెటైర్‌మెంటు వయస్సు ఏభై ఎనిమిది, ఏభై అయిదు అనిగాక అయిదేళ్ళు సర్వీసు పూర్తి చేసిన ప్రతివాణ్ణీ రిటైర్ చేసేస్తే పదిహేనేళ్ళలో నిరుద్యోగ సమస్యను నివారించవచ్చు. ఎలా ఉంది అయిడియా" అని వెనక్కి చూడబోతే అధ్యక్షుడు చక్రం కుర్చీలో వాలిపోయి ఉన్నాడు. (పాపం అతను ఉద్యోగంలో చేరి మొన్ననే అయిదేళ్లు దాటిందట).

— కోస్తావాణి

(1988 మే 25, కోస్తావాణి నుండి)



# వాడుక భాషలో తమాషాలు

శబ్దార్థాల సమ్మేళనమే భాష. ఈ వాగర్థాల బంధం విడదీయరానిదనీ, సర్వకాలాల్లోనూ అది శాశ్వతమనీ పూర్వుల అభిప్రాయం. అందుకే వారు వాగర్థాలను పార్వతీ పరమేశ్వరులుగానూ, రతీ మన్మథులుగానూ పోల్చారు. కాని సూక్ష్మపరిశీలన చేస్తే కాలప్రవాహంలో శబ్దాలూ, అర్థాలూ కూడా మార్పుచెందుతూనే వున్నాయని తెలుస్తుంది.

శబ్దం సాధారణంగా వ్యక్తుల ఉచ్చారణలోని కంగారు, అశ్రద్ధ, అసమర్థతల వల్ల మారుతుంటుంది. 'కొలను' అనేది 'కొల్లు' అయిపోయింది. పాలకొల్లు, ఈలకొల్లు అనే వూళ్ళఅసలు పేర్లు పాలకొలను 'ఈలకొలను.' 'పావురము' అసలు పేరు 'పారువము'. వాడుకలో పావురమయిపోయింది. 'జగదొంగ' 'గజదొంగ' అయిపోయాడు.

తప్పుడు విరుపువల్ల కూడా శబ్దాలు మారిపోతుంటాయి. ఇంగ్లీషులో 'ఏన్ ఈక్ నేమ్' అనేవి తప్పుగా విరవబడి 'ఎ నిక్‌నేమ్' అయి పూరుకుంది. పారశీలోని 'నారెంజ్' ఇంగ్లీషులో 'ఎ నారెంజ్' అని వాడబడి, తప్పుగా విరవబడి 'ఏన్ ఆరెంజ్' అయ్యింది.

ఇలా శబ్దాలు మార్పు చెందుతున్నట్లే అర్థాలు కూడా మారుతున్నాయి. ఇందులో పదం మారదు-పదార్థం మాత్రం మారుతుంది. అంటే శబ్దం అదే గాని ఆ శబ్దానికి మొదట్లో నిర్ణయింపబడ్డ అసలు అర్థానికి బదులు వేరొకఅర్థం ప్రచారంలోకి వస్తుంది. పూర్వం ఆడ మగ ఎవరు కట్టుకున్న బట్టనైనా 'చీర' అని అనేవారు. నన్నయగారి భారతంలో యిది ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. "ఆ ఋషిపుత్రుడు గట్టినచీరలు వ్రుదులములు" అన్నాడు. కాని నేటికాలంలో "చీర" అంటే ఆడవాళ్ళుకట్టుకునే 'కోక' మాత్రమే 'వాడు చీర కట్టుకున్నాడు'

అంటే వాడు ఏ నాటకంలో అయినా ఆడవేషం వేస్తున్నాడేమో అనుకుంటామంతే.

అలాగే 'ఉద్యోగం' అనే మాటకు అర్థం 'ప్రయత్నం' అని. ఇప్పుడది "పని" అనే అర్థంలోకి మారిపోయింది. ఏమిటి నీ వుద్యోగం అంటే నువ్వుచేసే పనేమిటి? జవానా? గుమాస్తా? ఆఫీసరా? అనేగాని ఏమిటి నీ ప్రయత్నం అని కాదుగా! 'వర్తకం' అంటే అర్థం 'వృత్తి' ఇప్పుడు కొనడం, అమ్మడంగా మారిపోయింది. 'వ్యవసాయం' అంటే 'ఆచరణ' - ఇప్పుడు భూమి దున్ని సేద్యం చెయ్యడం.

'ర', 'ఱ'ల భేదం గుర్తించే కాలంలో నీరు అంటే జలము, నీఱు అంటే బూడిద. నేడు నీరు అంటే బూడిద కూడా. ఒక్కోచోట కవితా రీతి కూడా అర్థం మార్పుకు కారణమవుతోంది. 'వాడు గోడ' అంటే "ఎంత చెప్పినా అర్థమైచావడు" అని. అంతేగాని అచ్చంగా గోడ అని కాదుగా!

అమంగళకరమైన అర్థాలు వచ్చే చోట ఆ శబ్దాలకు బదులు వేరే శబ్దాలు వాడడం వల్ల అసలర్థాలు మారిపోతున్నాయి. "దీపం కొండెక్కింది" అంటారు. అంటే ఆరిపోయిందని 'తైలం' అంటే తిలల సంబంధమైన నువ్వుల నూనె మాత్రమే. ఇప్పుడు తైలం అంటే 'డబ్బు' అని వాడుకలోకి వచ్చింది. ఆ పని అవ్వాలంటే తైలం కావాలి అంటుండడం నేడు సర్వసామాన్యంగా వింటుంటాం. 'విధవ' అంటే ధవుడు (భర్త) లేనిది. పూర్వం ఈ మాట పెళ్ళికాని పిల్లలకు కూడా వర్తించేది. (మొగుడు లేనందువల్ల) నేడు 'విధవ' అంటే పెళ్ళయ్యి భర్త చనిపోయిన స్త్రీ మాత్రమే.

అలాగే 'వ్యభిచారం' అంటే నిర్ణీతపథం నుండి తొలగిపోవడం. కాని ఇప్పటి అర్థం పరులతో సెక్సు సంబంధం కలిగివుండడం. 'కాలధర్మం' అంటే కాలం యొక్క ధర్మం — ఎండకాయడం,

జీవులు పుట్టడం, పెరగడం వంటివి.

ఇప్పుడు కాలధర్మం చెందేడు అంటే చచ్చాడు అని. 'సభికులు' అంటే 'జూదగాళ్ళు' అని అర్థం. ఇప్పుడు మీటింగ్‌లలో సభికులారా! అని సంబోధిస్తే జూదగాళ్ళారా! అని కాదు:గా! — సభలో నున్న జనులారా! అని. 'మర్యాద' అంటే అసలు అర్థం 'కట్టుబాటు', ఇప్పటి అర్థం 'గౌరవం'. 'కంపు' అంటే పూర్వం అర్థం 'సువాసన' నేటి అర్థం 'దుర్వాసన' అని. 'కైంకర్యం' అంటే 'సేవ', నేడు కైంకర్యం అంటే కాజేసెయ్యడం. 'ఛాందసుడు' అంటే చందస్సు తెలిసినవాడు–ఇప్పటి అర్థం పరమమూర్ఖుడు. 'ముష్టి' అంటే పిడికిలి. నేటి అర్థం అడుక్కునే వాడికి వేసే బియ్యం.

సినీమా ప్రభావంతో ఈ అర్థాలు ఈమధ్య మరీ గమ్మత్తుగా మారి పోతున్నాయి. 'బరువు' అంటే భారం. ఇప్పటి అర్థం 'లంచం'. (బరువు పెట్టందే పనెలాగవుద్దోయ్?) 'కాకా' అంటే కాకిఅరుపు. నేడు పొగడ్త. 'మందు' అంటే ఔషధం. నేడు విస్కీ, బ్రాంది, సారా. 'గోరోజనం' అంటే ఒక జంతువునుండి తీసి చేసిన ఔషధ పదార్థం. బాలెంతలకు వాడుతుంటారు. నేడు దీనికి అర్థం గీర, తలతిక్క అని. 'దయచేయండి' అంటే 'అనుగ్రహించండి' అని. ఇప్పటి అర్థం 'లోపలికి రండి', బయటికి వెళ్ళండి అని, ప్రబుద్ధుడు అంటే బుద్ధిమంతుడు అని. ఇప్పటి అర్థం బడుద్దాయని. పెద్దమనిషి అంటే గౌరవనీయుడని, ఇప్పుడు దగాకోరు అని. 'రామార్పణం' అంటే రామునికి సమర్పించడం. నేటి అర్థం స్వాహా చెయ్యడం. సన్యాసి అంటే సర్వసంగ పరిత్యాగి అని. ఇప్పటి అర్థం ఎందుకూ పనికిరానివాడని. 'పలుకుబడి' అంటే 'పలుకుల తీరు' అని. నేటి అర్థం గౌరవం. 'పరపతి' అంటే ఇతర భర్త. ఇపుడు 'పరపతి' అంటే 'పరువు' అని. అలాగే 'పరవశుడు' అంటే ఇతరులకు లొంగిపోయినవాడు అని. కాని వాడుక తన్మయత్వం పొందినవాడు అని. 'హరికథ' అంటే అదో కళాప్రక్రియ.

ఇప్పుడీ మాటకు అర్థం అబద్ధాల కబుర్లు. (హరికతల్ చెప్పకు). 'సుత్తి' కంసాలి వాడే సాధనం. కాని ఇప్పటి అర్థం బోర్ కొట్టించే ప్రసంగం. విసుగెత్తించే ప్రసంగం చేస్తున్నప్పుడు అబ్బ! సుత్తె య్యకురా - అంటుండడం ఇప్పుడు పరిపాటిగా వింటుంటాం.

సూక్ష్మంగా పరిశీలిస్తే నేటి సమాజం భాషలో ఇలాంటి తమాషా అర్థాల్లోకి మారిన పదాలు కోకొల్లలుగా కనిపిస్తాయి.

— ఆంధ్రప్రభ
(1985 నవంబర్ 12,)



# హిందీ భాషలో కొన్ని తమాషాలు

భారతదేశంలో ఎక్కువ రాష్ట్రాల్లో మాట్లాడే భాష హిందీ. టి.వి.లు వచ్చాక ఇప్పుడు అందరికీ అకస్మికంగా ఈ భాష అవసరం ఏర్పడింది. ఈ భాషా విషయమై లోతులకు వెళితే ప్రాచీన హిందీ అనేది 'అవధి', 'వ్రజ' భాషలు. వీనిలో తులసీదాసు, సూరకవి, కబీరు ప్రసిద్ధ రచనలు చేశారు. తులసీదాసు "రామ చరిత మానస్" "అవధి" భాషలో వ్రాశారు. ఇది తులసీ రామాయణంగా ప్రసిద్ధి పొందింది. ఎన్నో భాషలలోనికి రామచరితమానస్ తర్జుమా పొందింది.

'పార్సీ', 'అరబిక్' భాషల మిశ్రమాన్ని 'హిందూస్తాన్' అంటారు. మహాత్మాగాంధీ దీన్ని జాతీయ భాష చెయ్యాలన్నారు. కానీ ఇందుకోసం వేసిన కమిటీ స్వచ్ఛమైన హిందీనే జాతీయ భాషగా సిఫార్సు చేసింది. దీనిలోని వ్యావహారికమే 'ఖడీబోలీ' అంటారు. ఇందులో మైథిలీ శరణ్‌గుప్త, జయశంకర ప్రసాద్, శ్రీమతి మహాదేవి వర్మ, నిరాల, ప్రేమచంద్ చెప్పుకోదగ్గ రచనలు చేశారు. ముఖ్యంగా ప్రేమ్‌చంద్ వర్గతత్వం మీద ఒక విప్లవాన్నే సృష్టించాడు. ధనవంతులు ధనహీనులను ఏ విధంగా కబళిస్తున్నారో, బలహీనులు బలవంతుల వలలో ఎలా దగా పడుతున్నారో సాహిత్య రూపంలో విశృంఖలంగా వ్రాసి విశేష ప్రఖ్యాతి పొందాడు. గ్రామాలలో బడుగు వర్గాలను ఆలంబనంగా చేసుకుని అల్లిన రంగభూమి, గోదాన్, కర్మభూమి, నిర్మల నవలలు దేశంలో ఎంతో సంచలనం సృష్టించాయి. సంఘపరంగా ఎన్నో అత్యాచారాలను, అనాచారాలను ఒక దుయ్యపు దులిపేశాడు. 'నిర్మల' నవలలో వృద్ధ భర్త పడుచు కొడుకుతో భార్యననుమానించడం, ఈ అనుమానం భరించలేక ఆమె ఆత్మహత్య చేసికోవడం చాలా హృదయవిదారక సన్నివేశం. పాఠక హృదయాల్ని కదలించేస్తుంది.

ఇక ఆధునిక దృష్టితో చూస్తే ప్రపంచ వ్యాప్తంగా సాహిత్యం లో వచ్చిన విప్లవం ఇందులోనూ చోటు చేసుకొంది. తెలుగులో దిగంబరకవుల లాగే హిందీలో కూడా నవీన్, ఉగ్ర, జైనేంద్ర కుమార్, సుదర్శన్ వగైరా యువకవులు ఆర్థిక సాంఘిక రాజకీయ సమస్యల్ని తూర్పారబట్టేశారు.

ఈ భాష భారతీయ భాష లన్నిటిలోకి చాలా సుసంపన్న మైనది. సంస్కృతం నుంచి ఎక్కువ పదజాలాన్ని ఈ భాషలోకి దీసుకోవడం ఇందుకు కారణం. భారత దేశంలోని ఇతర భాషలు చాలవరకు సంస్కృత జన్యమో, సంస్కృత భాషా ప్రభావమో కలిగి ఉండడం వల్ల వాటిలోని శబ్దాల ఆదాన ప్రదానాలతో ఈ భాషచక్కగా పెరిగి ఇంగ్లీషువలె వ్యాప్తి చెందింది. అంతేగాకుండా ఉత్కృష్టమైన కావ్యాలూ, నాటకాలూ, నవలలూ ఇతర సాహిత్య ప్రక్రియ ఈ భాషలో ఉద్భవించాయి.

హిందీని నేర్చుకోవడం వల్ల ఆ బాషకేదో మేలు చేస్తున్నామని బావించకుండా మనమే లాభం పొందుతున్నామనే విషయాన్ని గ్రహించవలసిన సమయం వచ్చింది. నిజానికి హిందీ తమపై రుద్ద వలదని అలజడి లేవదీసిన తమిళులే ఇప్పుడు ఎక్కువగా హిందీ నేర్చుకొని దేశంలో వివిధ ప్రాంతాలలో అగ్రగాములుగా కూర్చున్నారు.

ఈ భాష లిపి దేవ నాగరి లిపి. ఇది ఇతర లిపుల కంటే చాల నిర్దుష్టమైనది. అక్షర స్వరూపం మరపురానిది. ఉదాహరణకు ఉరుదూ లిపి ఉందనుకోండి — అది చాలవరకు చుక్కల మీద నడుస్తుంది. చుక్కలు గనుక అలా పెట్టేటప్పుడు ఒకటి అరా మరచిపోయే ప్రమాదముంది. అలా మరిచిపోతే జరిగిన ఒక ఫార్సు మనవాళ్ళు చెబుతుంటారు. 'సేట్ జీ అజ్మీర్ గయే' అని ఇంటికి టెలిగ్రాం యిస్తే 'సేట్ జీ ఆజ్ మర్ గయే' గా మారింది. ఇంటిల్లిపాదీ ఘొల్లు మన్నా

రట. యిది చుక్కలు తెచ్చిన తంటా. యింగ్లీషు భాషలో లాగ యీ భాషలో సైలెంట్ సిలబుల్స్ లేవు Walk (వాక్), Talk (టాక్), లాగ. 'జోలిఖా జాతాహై వహీ పఢాజాతాహై" (వ్రాయడంలో ఏ విధంగా వుంటే చదవడం కూడా అదే విధంగా ఉంటుంది.)

యిప్పుడు దేశంలో హిందీ మాట్లాడే వారు 54 కోట్ల దాకా ఉన్నారు. యింగ్లీషు మాట్లాడేవాళ్ళు ఒక కోటి మంది మాత్రమే. పూర్వం వలె గాక యిప్పుడు ఈ భాషలో ఉచ్చారణ సారళ్యాన్ని కూడా అంగీకరించారు. వుదాహరణకు పూర్వం 'ఖబర్' అనే దాన్ని యిప్పుడు "కబర్" అని ఒప్పేసు కుంటున్నారు. భాషలో క్లిష్టత తొలగించడానికి యింకా కొన్ని మార్పులు చేయవచ్చు. ఉదాహరణకు కర్మననుసరించి వచ్చే 'నే' ప్రత్యయం తీసేస్తే వచ్చే నష్టం ఏమీ లేదు. "మైనే రోటీ ఖాయా" అనటానికి 'మై రోటీ ఖాయా' అనే వాక్యానికి అర్థంలో ఏమీ తేడా లేదు.

టైప్ రైటింగ్, షార్ట్ హేండ్‌ల కోసం లిపి కూడా సంస్కరించ వచ్చు. 'అ' అనే హిందీ అక్షరంపై రావలసిన కొమ్ములు వ్రాస్తే ఆ, ఒ, ఔ, అం, అః అనేవి వచ్చేస్తాయి. అలాగే 'ఉ' మీద 'ఊ', 'శ' అక్షరాలు ఏర్పడతాయి.

కాని హిందీ బాష నేర్చుకోవడంలో కొంత జాగ్రత్త కావాలి. మాటలో ఏ చిన్న మార్పు చేసినా అర్థం మారిపోతుంది. వుదాహరణకు మనవాళ్ళు 'ఛోటా భాయీ' అంటుంటారు. 'ఛోటా' అంటే 'పిలక' అని అర్థం. అంటే పిలక సోదరుడని అర్థం వస్తుంది. కాని ఆ మాటలో అతని భావం చిన్న తమ్ముడని. చిన్న అనే అర్థం రావాలంటే 'ఛో' లో వత్తు పలకకూడదు. "చోటా" అనాలి. నాలుగవ యిల్లు అని చెప్ప డానికి "చౌదహ్ ఘర్" అంటుంటారు అలా అంటే అది నాలుగవ ఇల్లు కాదు, పధ్నాలుగవ యిల్లుగా మారిపోతుంది. కొందరు 'సౌధా గర్'

అంటుంటారు. 'సౌధా గర్' అంటే 'బేరగాడు' అని అర్థం. నాలుగవ యిల్లు అనాలనుకున్నప్పుడు 'సౌధా ఘర్' అంటే సరిపోతుంది.

చాలా గోడల మీద చూస్తుంటాం "ఛలో హైదరాబాద్" అని. 'ఛల్ నా' అంటే అర్థం మోసగించడం అని. అందుకే ఆ రాత చదువుతుంటే భలే నవ్వొస్తుంది. అది వ్రాసిన వాళ్ళ ఉద్దేశం "పదండి హైదరాబాదు" అని. ఆ అర్థం రావాలంటే 'ఛ'కి ఒత్తు లేకుండా 'చలో హైదరాబాద్' అనాలి.

— కోస్తావాణి
(1988 ఆగస్టు 15)



# నాటక పరిషత్తులు - న్యాయ నిర్ణయం

ఈనాడు తెలుగుదేశంలో నాటక కళా పరిషత్తులు తామర తంపరగా పుట్టుకొస్తున్నాయి. ప్రతి ప్రదర్శనకు కొంత పారితోషికం కూడా యిస్తున్నారు. కళా విషయకంగా యిది శుభ పరిణామం. ఈ విధంగా ఔత్సాహిక నాటక సమాజాల ప్రదర్శనలకు వేదికలు లభిస్తున్నాయి. పైగా దేశంలో వివిధ ప్రాంతాలలోని నటీనటులు ఒకచోట చేరి ఒకరి నుండొకరు అనేక క్రొత్త విషయాలు తెలిసి కోవ డానికి అవకాశం కలుగుతుంది. "ముఖే ముఖే సరస్వతి".

అయితే ఎంతో శ్రమచేసి పోటీకి వస్తున్న యీ నటీనటులూ, నాటక సమాజాలూ నూటికి తొంబై అయిదు మంది వచ్చిన ఉత్సా హంతో వెళ్ళలేక పోతున్నారనేది దాచలేని సత్యం. కారణ - పోటీ చేసిన 10, 15 సమాజాల్లో ఒకటి రెండింటికి మాత్రమే ప్రయిజు లివ్వడం మిగిలిన సమాజాలు వట్టి చేతులతో నైరాశ్యంతో వెళ్ళవలసి రావడం, అలాగే ఏ ముగ్గురు నలుగురు నటులకో ప్రయిజులు వస్తే మిగతా వందలాది నటులు మొగాలు వ్రేలాడేసుకుని వెళుతుంటే ఆ సమయంలో వాళ్ళని చూడ్డానికే బాధేస్తోంది. పోటీలన్న తరవాత అందరికీ ప్రయిజులు రావనేది అందరూ ఎరిగిన సత్యమే అయినా ఆ సమయంలో ప్రయిజులు కళావిహీనంగా దెబ్బ తిన్న సిపాయిల్లా [ఖిన్ను] అయిపోతూ వెనక్కి మళ్ళుతున్న దృశ్యం హృదయ విదార కంగా వుంటోంది. వాళ్ళు ఆ బాధలో జడ్జిల మీద విసిరే నిందలూ, విమర్శలూ ఒకసారి జడ్జీగా వెళ్ళిన వాణ్ణి మళ్ళీఎప్పుడూ ఆ పనికి ఒప్పుకోకుండా చేస్తోంది. అంటే యిప్పుడు జరుగుతున్న ఈ విధానం ఆరోగ్యవంతమైనది కాదని అర్థమవుతోంది. "స్పర్ధయా వర్ధతే విద్య" అనేది పోటీలధ్యేయం. స్పర్థతో విద్య పెరుగుతుంది. అది ఆరోగ్య వంతమైన స్పర్థతో మాత్రమే. ఈనాడు నటీనటులు పరిషత్తుల్ని ఈ కోణంనుంచి చూడ్డం లేదేమో అనిపిస్తోంది.

పెద్ద పెళ్ళిలా ప్రారంభమైన పరిషత్తు చివరి రోజు విషాదంగా ముగుస్తుంది ఎక్కువ మంది ప్రయిజులు రాని కళాకారులేవుంటారు గనుక. కళాకారులలో ముందు యీ మానసిక ప్రవృత్తి మారకపోతే పరిషత్తుల ప్రయోజనం శూన్యం. పరిషత్తుల ప్రధానోద్దేశం ప్రయి జులేకాదనీ, చెల్లా చెదురుగా వున్న ఉత్తమ కళాకారులను ఒకవేదిక మీదికి తెచ్చి ఒకరిలో వుండే కళాకౌశలాన్ని మరొకరికి చూపించి పరస్పర ప్రభావితుల్ని చేయాలనే సత్సంకల్పమే దీనిలోని under Current అని తెలిసికొంటే ప్రయిజులు రానివాళ్ళు నిరాశాని స్పృహలతో యింత సతమత మవ్వవలసిన అవసరం వుండదు.

ప్రయిజు తనకి రానంతటితో ఆ పరిషత్తు మీదో, ఆ జడ్జీల మీదో ద్వేషం పెంచుకుని విషప్రచారాలు సాగించే నటీనటుల్ని ఎందర్నో చూస్తున్నాం. అంటే వాళ్ళకి పరిషత్ 'స్పిరిట్' అర్థం కాలేదన్నమాట. ఫలానా చోట ప్రయిజు వచ్చిన ఫలానా నాటకానికి ఫలానా చోట కూడా ప్రయిజు రావాలనిలేదు. జడ్జిమెంటు అనేవి తులనాత్మక పరిశీలన (Comparitive Sudey). ప్రయిజులు రానంత మాత్రాన సమాజాలూ, నటులూ తమ ప్రదర్శనలు బాగుండ లేదనే అభిప్రాయంతో జడ్జీలు తమకు ప్రయిజులు యివ్వలేదనుకునే భావన లోనే పొరబాటుంది. ప్రయిజు రాకపోవడం బాగుండక పోవడం వల్ల కాదు – అంతకంటే బాగున్న మరొక ప్రదర్శన వుండడంవల్లనే నని గ్రహించాలి. పరిషత్తులో తమస్థాన నిర్ణయాన్ని 'స్పోర్టివ్' గా తీసికొని లోపాలు తెలిసికొని సవరించుకొని మరొక పరిషత్తుకు వెళ్ళ డానికి మరింత గట్టిగా కృషిచెయ్యాలి తప్ప ప్రయిజు రాలేదని పరి షత్తుల మీదో, జడ్జీల మీదో 'బురద' చల్లడం కళారంగానికే అపచారం.

పరిషత్తుల్లో న్యాయ నిర్ణయానికి అనుసరించ వలసిన అంశ ములు (Principles) నిర్దుష్టంగా లేకపోవడం యీ విమర్శలకు కొంత

కారణమేమో అని పిస్తోంది. ఈ విషయంలో కొలబద్ద ఏమిటయ్యా అంటే యిప్పుడు అందరు చెప్పేది ఒక్కటే. 'హృదయం' - 'హృదయాన్ని స్పృశించి, మథించి, పరవశింప జేసేదే ఉత్తమనటన' అని. ఇది ఒక Abstract నిర్వచనం. దీనికి ఎవరికి తోచినట్లు వాళ్ళు వాళ్ళ వాళ్ళకోణాల్లోంచి వ్యాఖ్యానించి తమతమ వాదాలకి అన్వయింపజేసి కోవచ్చు. ఈ మనస్సు స్పందించడం అలరించడం అనేవానికి స్థాయి ఏమిటి? ఒక్కొక్కళ్ళ మనస్సు ఒక్కోచోట స్పందిస్తుంది. ఒకరిని అలరించే విషయం మరొకర్ని అలరించక పోవచ్చు. 'లోకోభిన్నరుచిః' ఇలా మనిషికి మనిషికి మధ్య ప్రవృత్తిలో భిన్నత్వ ముండడమే గాక ఒకే మనిషికి బిన్న సమయాలలో భిన్న ప్రవృత్తి ఉండడం కూడా సహజం. కాబట్టి జడ్జిమెంటుకు విశేష ప్రాధాన్యాన్నిచ్చి తలలు బద్దలు కొట్టుకోవలసినంత అవసరంలేదు. పరిషత్ అంటే నలుగురు కళాకారులూ కలుసు కోవడానికి ఏర్పాటైన కళోత్సవాల సంరంభం అని భావించుకుంటే వచ్చిన నాటి ఆనందం చివరంటూ వుంటుంది.

అయితే యీ కళా సముదాయంలో కొంచెం చైతన్యం కోసం యీ పరిషత్తులు యూనివర్సిటీల లాగ ప్రదర్శించిన నాటకాల స్థాయిని బట్టి వానిని ఫస్ట్ క్లాస్, సెకండ్ క్లాస్, థర్డ్ క్లాస్‌లుగా నిర్ణయించి ఫస్ట్‌క్లాస్ వానికి ఫస్ట్‌క్లాస్ సర్టిఫికెట్టూ – ఒక మొమెంటో, సెకండ్ క్లాస్ వానికి సెకండ్ క్లాస్ సర్టిఫికెట్టూ – ఒకషీల్డూ చొప్పున యిచ్చి మరీ అత్యుత్తమంగా కనిపించిన ఒక ప్రదర్శనకు, ఒకనటికి ఒక నటునికి Distinction డిక్లేర్ చేసి అవార్డులు ఇస్తే కళాకారులలో ఎక్కువ మందికి సంతృప్తి. ఈ వేడుకల కొక వేడి సృష్టించవచ్చు. మరి యీ స్థాయిలు (grades) నిర్ణయించడ మెలాగ? దీనికి సమాధానం చాలా సింపుల్. యూనివర్సిటీలు ఎలా నిర్ణయిస్తున్నాయో అలాగే—

యూనివర్సిటీలో పోస్టుగ్రాడ్యుయేట్ పరీక్షకు కూర్చునేవాళ్ళు

డిగ్రీ పరీక్ష పాసైవుండాలి. అలాగే మన పరిషత్తులకు 'గ్రాడ్యుయేట్సు' డిగ్రీ పరీక్షన్న మాట. ఇక యూనివర్శిటీవారు పరీక్షలో విద్యార్థికి వచ్చిన మార్కులను బట్టి వారి స్థాయిని నిర్ణయిస్తారు. 60% పైన మార్కులు వచ్చినవారు ఫస్ట్ క్లాస్, 50%- 60% మధ్య వారు సెకండ్ క్లాస్, 40%- 50% మధ్యవారు థర్డ్ క్లాస్. అలాగే నాటకాలకు కూడా మార్కుల పద్ధతిపై ఈ నిర్ణయం చెయ్యవచ్చు. ఇలా చెప్పినప్పుడు కొన్ని పరిషత్తుల్లో కళ హృదయ స్పందిని కదా దానికి మార్కులు ఎలావేస్తారు అని నన్ను ప్రశ్నించిన వాళ్ళు కూడా వున్నారు. అయితే మరి యూనివర్సిటీ ఎగ్జామినర్స్ హుమానిటీస్ ఆన్సరు పేపరు చదివి ఎలా మార్కులు వేస్తున్నారు? అనేది నా ప్రశ్న. 'శ్రీనాధుని కవితా సౌరభమును వివరింపుము' అని 20 మార్కులు పెట్టిన ప్రశ్నకు విద్యార్థులు వ్రాసిన దానిని బట్టి మార్కులు వెయ్యడం లేదా? ఇది మాత్రం హృదయ గతం కాదా? ఎన్నిమార్కులు వెయ్యాలనే నిర్ణయానికెలా వస్తున్నాడు? ఆ 'ఆన్సరు' చదివిన తరువాత ఆప్రశ్నకున్న మార్కుల్ని బట్టి దీనికిన్ని మార్కులు వెయ్యవచ్చు అని మనసు చెబుతుంది. ఆ విధంగా వేస్తాడు. ఆ మార్కులను బట్టి శ్రేణి (clan) నిర్ణయింప బడుతోంది. అతడు అలా నిర్ణయానికి రావడానికి కొన్ని ఆధారాలు కూడా నిర్దేశింపబడి వుంటాయి. ఉదాహరణకు - శ్రీనాధుని కవిత మీదే వ్రాయమంటే యీ క్రింది అంశాలు ఆ 'ఆన్సరు'లో ఎంతవరకూ చోటు చేసుకున్నాయో పరిశీలించి మార్కులు వేస్తారు. 1) శ్రీనాధుని రచనలు 2) కవితాధార - శైలి 3) తీసికొన్న సంఘటనలు - పోషించిన విధము 4) ప్రయోగవైచిత్రి - విశృంఖలత్వం. 5) శ్రీనాధుని కాలము - సామాజిక స్పృహ 6) శ్రీనాధుని శృంగారము - ఈశ్వరార్చన కళాశీలత 7) అతని కవిత్వంపై ఆనాటి నుంటి యీనాటి వరకూ వివిధ కవి పండితులు వెలిబుచ్చిన అభిప్రాయాలు - ఇలా విశ్లేషించి చూసి మార్కులు వేస్తారు. అలాగే నాటక పరిషత్తుల్లో 'ఉత్తమ రచన'ను నిర్ణయించేటప్పుడు ఇలాంటి కొన్ని

మూలసూత్రాలు రూపొందించుకొని వాని ఆధారంగా మార్కులు నిర్ణయించవచ్చు. ఇతి వృత్తంలో నవ్యత, సందేశం, శైలి, సంభాషణాచాతుర్యం, రచనలోనిబిగువు, సన్నివేశకల్పన, పాత్రసృష్టి-వైవిధ్యం, నాటకీయమైన మలుపులు, రసపోషణ, కథాగమనం, కార్యైక్యము, కాలైక్యము, వస్త్వైక్యము. క్లయిమాక్సు, ఏంటీక్లయిమాక్సు, ట్విస్టు, ప్రదర్శనాయోగ్యం యిలా కొన్ని ప్రమాణాలు ఏర్పాటు చేసికొని రచనను ఆ విధంగా తూచి మనస్సు చెప్పినట్లు మార్కులు వేసి ఉత్తమత్వాన్ని నిర్ణయించవచ్చు.

దృశ్యసాక్షాత్కారం చేసికోగల జడ్జీలు ప్రదర్శనకి ముందే రచనలన్నీ చదివి ఉత్తమ రచన ఎన్నిక చేయవచ్చు, అలా చేస్తే ప్రయిజు లిచ్చే సమయానికి ఆ రచయితను కూడా రప్పించి సన్మానించవచ్చు. రచయితకు సన్మానమనేది చాలా అవసరం కూడా - స్క్రిప్టే గదా నాటకానికి ప్రాణం, దానిని సృష్టించిన ఆమేధావిస్థానం నాటక రంగంలోని యితర కళాకారులందరి కంటే కూడా గొప్పదని నా అభిప్రాయం. జడ్జీలకు ఆ దృశ్యసాక్షాత్కారబలం లేనప్పుడు నాటకం దృశ్యకావ్యంగనుక ప్రదర్శనానంతరం కూడా ఈ నిర్ణయం చెయ్యవచ్చు. అయితే యీ రచయితని మరు సంవత్సరం పరిషత్ ప్రారంభంలో సన్మానించవలసి వుంటుంది. సంవత్సర కాలంతరువాత ఆ సన్మానానికి అవేడి వుండక పోవచ్చు. ఇలాంటి పనులు ఎప్పటికప్పుడు జరిగిపోతేనే అందం. అందుకే న్యాయ నిర్ణేత భావుకుడు, విమర్శకుడు, రచయిత, ప్రయోక్త, నటుడు అయివుండడం అవసరం.

## ఉత్తమ దర్శకత్వం.

రచయిత వ్రాసిన దానికి కళాస్వరూపమిచ్చి పాత్రలను ప్రాణప్రతిష్ఠ చేయడంలో దర్శకుని పాత్ర ఎంత అనేది దర్శకప్రతిభను Judge చెయ్యడానికి కొలమానం. మంచి 'టీమ్ వర్కు' తో దృశ్య

భావనను సింబాలిజంతోనూ, సన్నివేశాల్ని రియలిజంతోనూ ప్రేక్షకుని కళ్ళముందు నిలపడం, సాంకేతిక పద్ధతుల్ని సహజంగా అతకడం. వంటి వానిలో దర్శకుని ప్రతిభ బాగా గోచరిస్తుంది.

న్యాయ నిర్ణేతలు ముందుగా స్క్రిప్టులు ఆ మూలాగ్రంగా చదివి ఒక అవగాహనకు వచ్చివుంటే ప్రదర్శన చూసేటప్పుడు దర్శకుని పనితనము ప్రస్ఫుటంగా తెలుస్తుంది. దర్శకుడు రచయిత భావనకు సరిగా అద్దం పట్టిచూపగలిగాడా, కళాత్మక విలువలు ఎంతవరకూ ప్రతిష్ఠించి పరిపుష్టి చేసి జనరంజకం చేయగలిగాడూ అనేది కూడా న్యాయనిర్ణేతలు పరిగణన లోనికి తీసికొని ఉత్తమ దర్శక బహుమతిని నిర్ణయించాలి.

ఉత్తమ నటీనటులు

దీనికి గతంలో మన జడ్జీలు మార్కుల పద్ధతినే అనుసరించే వారు. చతుర్విధాభినయములైన ఆంగిక సాత్వికవాచిక ఆహార్యాభిన యాలకు వేరువేరుగా మార్కులు వేసి అవి మొత్తం కలిపి ఎవరికి ఎక్కువ మార్కులు వస్తే వారిని ఉత్తమ నటులుగా నిర్ణయించేవారు. ఇది Mechanical అయిపోయిందని ఇప్పుడు ఆ పద్ధతి మానివేసి 'మనో స్పందన' పేరుతో నిర్ణయాలు చేస్తున్నారు. ఏ రోజులపాటు చూసిన ఎన్నో ప్రదర్శనలలోని వివిధ పాత్రలను చివరి రోజువరకూ మనో ఫలకం మీద వుంచుకొని అప్పుడు నిర్ణయాలు చెయ్యగలగడం అసాధారణ 'ధారణ' గలవారికి సాధ్యమేమో గాని యీ జ్ఞాపకశక్తి (Retention Power) అందరికీ వుండడం కష్టం. అందుకనే ఒక్కొక్క ప్పుడు తప్పుడు నిర్ణయాలు వచ్చిన సందర్భాలు కూడా వున్నాయి. కాబట్టి వీనికి నిర్ణయించుకున్న ప్రమాణాలతో ఎప్పటి కప్పుడు మార్కులు వేసి 'స్థాయి' నిర్ణయం చేసేసి అట్టే పెట్టుకుంటే ఆఖరున Recollection కోసం గింజుకోవలసిన అవసరం వుండదు.

అభినయంలో మొదటగా గణింపబడేవి వాచకం. పాత్రోచితమైన భాషణ, డైలాగ్ చెప్పడంలో తీసికోవలసిన 'పాజ్' Accent, ఏ స్వరంమీద ఎంత 'ఊనిక' వుండాలో, ఏ అక్షరాలు ఎలా నొక్కితే రసస్ఫూర్తి వస్తుందో, ఆరోహణ, అవరోహణ మొదలగు విషయాలు ఇందులో పరిశీలించాలి. సంగీతంలో సపస లలాగే ఉచ్ఛారణలో ఆరోహణ అవరోహణలు సరిగా పాటిస్తే మాటలను మంత్రించి వదలినట్లు సమ్మోహితుల్ని చేస్తాయి. ఉచ్చారణ కృతకంగానూ, వట్టి పట్టి ఒప్పగిస్తున్నట్లూ కాక సహజంగా వుండాలి. ఇలాంటి వానినన్నిటినీ దృష్టిలో పెట్టుకుని యీ అభినయానికి మార్కులు వేసికోవచ్చు.

ఇక ఆంగికం : మాటల్లోని భావాన్ని అంగ ప్రత్యంగ వుపాంగాలతో వ్యక్తీకరించడమే ఆంగికాభినయం. మాటలకు బదులు Action, Reaction లతో ఆ భావాన్ని వ్యక్తీకరించే అవకాశాలు కూడా చాలా వుంటాయి. జరుగుతున్న సన్నివేశాల్ని బట్టి భృకుటి ముడవడం, పెదవి విరవడం, కనులతోనే మాటల కందని భావాలను ప్రస్ఫుటీకరించడం, చేతులూ కాళ్ళూ యాదృచ్ఛికంగా వాని వాని స్థానాల్లోకి పరిభ్రమించవడం, సహజమైన నడకలు (Steppding), రంగస్థలంమీది వస్తువుల్ని సరిగా వినియోగించుకోవడం ఇవన్నీ ఇందులో కేవస్తాయి. ఇవి Artificial గా కాకుండా పాత్రకు సహజమైన రీతిలో కనబడేటట్టు చేశారా లేదా అనేది కూడా గమనించవలసి వుంటుంది. Speed కోసం అవసరం లేకుండానే కొంతమంది బల్లమీద భరత నాట్యమాడేస్తున్నారు అదో పెద్ద టెక్నిక్ లాగ. ఇందులో వాళ్ళ శ్రమ కనిపిస్తుంది తప్ప సహజత్వం వుండదు. కృతక ప్రయోగం అవుతుంది. 'Art is imitation' నటన సమాజానికి ఎంత దగ్గరగా వుంటే అంత సహజంగా వుంటుంది. జడ్జీలు ఇలాంటివన్నీ దృష్టిలో పెట్టుకుని దీనికి మార్కులు వెయ్యవచ్చు.

ఆహార్యం :- వేస్తున్న వేషానికి సరిపడే వేషధారణ జరిగిందా రచయిత సృష్టించిన సన్నివేశాల కనుగుణంగా ఆవేషధారణలో మార్పుజరుతోందా, అది సహజంగావుందా, ఆ వే ష ధా ర ణ కు ఆనటుడు సరిపోయి "తాను" అనేదివదలి సంపూర్ణంగా పరకాయ ప్రవేశం చేశాడా వంటివి యిందులో పరిగణనీయాంశాలు.

సాత్వికం :- ఇదినటనకే తల్లిలాంటిది. స్థూలంగా నాటక రంగంమీద రోమాంచకంపశ్వేదాదులు సాత్వికమంటారు. అంటే ఆయాసన్నివేశాల్లో నటునిహృదయం రసనిష్పన్నతపొంది శరీరం మీది రోమాలు నిక్కబొడుచుకోవడం. చెమటలుపట్టడం, ఒళ్ళు జలదరించడం. కళ్ళు నీరుగారడం వంటివి సహజంగా జరుగుతాయి. ఇవి నటుడుపాత్రలో లీనమై నటించినప్పుడే జరుగుతాయి. అలా లీనంకావడమే నటనకు గీటురాయి.

అంతేకాకుండా నటనకు ముఖ్యంగాకావలసింది Ease ఇది నిజమైన నటునకు మాత్రమేవుంటుంది. ఏదీ కృత్రిమంగా కుండా అన్నిటినీ సహజంగానేచేస్తాడు. ప్రేక్షకులచేత తననిజస్వరూపాన్ని మరిపించి పాత్రలో తమజీవించాలి. అంటేప్రేక్షకులు అతను చేసేది నటనకాదని నిజమనేభ్రాంతిలో మునిగిపోయేటట్టు చెయ్యాలి. ఇది వుత్తమనటనకు అత్యంత ముఖ్యమైన లక్షణం.

అలాగే నాటకంతక్తి అతనిపాత్రతోద్పడిన విధము. ప్రక్క పాత్రలకు అతని సహకారం, పాత్రను అర్థంచేసికొని రచయిత భావానికిచేసిన న్యాయంవంటి విషయాలనుకూడా దృష్టిలోపెట్టుకుని నటీనటులకు మార్కులువేసి Rank నిర్ణయించవచ్చు.

ఈపద్ధతిలో ఉత్తమ ద్వితీయనటి. ఉత్తమ ద్వితీయనటుడు. ఉత్తమ విలన్, ఉత్తమ హాస్యపాత్ర. ఉత్తమ అల్పపాత్ర,

ఉత్తమ చెత్త పాత్రవంటి వేరు వేరు ప్రయిజులు అక్కరలేదు. ఏకాపతునటుడైవా నటుల జాబితాలోని ఏదో శ్రేణికి వచ్చేస్తాడుకదా!

దర్శకుని ప్రతిభ, నటీనటుల పనితనం, సంగీతం, రంగాలంకరణ, టీమువర్కు, టెక్నిక్, సమయపాలన, ప్రజారంజకం, నవ్యత, అన్నింటికంటె ముఖ్యంగా అది మనస్సుకు హత్తుకుపోయి నరీతి, రసపోషణ వగైరాలనుబట్టి ప్రదర్శనస్థాయిని నిర్ణయించాలి.

డిస్టిన్‌క్షన్ అవార్డు : యూనివర్సిటీలలో ప్రతిసంవత్సరం ఫస్ట్‌క్లాస్ వచ్చినవాళ్ళలో అందరికంటే ఎక్కువమార్కులు వచ్చిన విద్యార్థికి Gold Medal యిస్తారు. అలాగే ఇక్కడకూడా డిస్టిన్‌క్షన్ ప్రదర్శనకి, నటనకి "ఎవార్డు" యిస్తే అన్నివిధాలా యూనివర్సిటీ సిస్టమ్ Follow అయినట్లువుతోంది. అంటే ప్రతిపరిషత్తు ఒక నాటక యూనివర్సిటీగానూ, నటులకు వారిస్థాయినిబట్టి పట్టప్రదానంచేసే ఉన్నతసంస్థగానూ క్రొత్త విలువల్ని సంతరించుకుంటుంది యూనివర్సిటీలు యీవిధానాన్ని ఏన్నోసంవత్సరాలనుంచి అనుసరిస్తున్నాయి. ఎప్పుడూ ఇది సరియైనదికాదని చెప్పుకోదగ్గ విమర్శ (Coment) రాలేదు. కాబట్టి సహృదయకళాకారులూ, పరిషత్తులవారూ, యీ విధావాన్నికూడా ఆలోచించి చూడమని నాసూచన.

మనసమాజాలు ప్రయిజులు ప్రకటించగానే దీనవదనాలతో వెంటనే తిరుగు ప్రయాణంచేసే పద్ధతిపోయి చివరన ఒకగోష్ఠిపెట్టుకుని ప్రతినాటకంమీదా జడ్జిల అభిప్రాయాలు తెలిసికొని వాదప్రధానంగాకాకుండా వివాదంలోకి దిగకుండా, విశాలహృదయంతో అర్థంచేసికొని అందరూ ఆనందంగా కరచాలనం చేసికొని వెళ్ళగలిగితేనే పరిషత్తులధ్యేయం ఫలించినట్లు, లేకుంటే యీపని శ్రమదండుగ – డబ్బుదండుగ.

---

# మయూరి నాటికల పోటీ విశేషాలు

నేటి రాజమహేంద్రవర సాహిత్య సాంస్కృతిక సంస్థలలో శ్రీ చింతల గోపాలరావు ఆధ్వర్యంలో నడుస్తున్న మయూరి కళా సమితి అగ్రశ్రేణి సంస్థ. వీరి ప్రతి కార్యక్రమానికి ఎప్పుడూ హాలులో సీటులు చాలక వేలాదిమంది బయటనిలబడి పోవడం ప్రవేశం దొరక్క వెనుతిరిగిపోవడం. సర్వసాధారణం

ఈ నెల 21 తేదిన క్రొత్త దినపత్రిక "కోస్తావాణి" ప్రారంభోత్సవ సందర్భంగా శ్రీ వెంకటేశ్వర ఆనం కళా కేంద్రంలో మయూరి కళాసమితి రాజమహేంద్రవర పట్టణస్థాయిలో ఏర్పాటు చేసిన నాటికల పోటీలలో స్థానిక సమాజాలు ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నా.యి రంగస్థల సంచలన దర్శకుడు శ్రీ టి. జె. రామనాధం నిర్వహణలో ఆ సమాజాలు ప్రదర్శనలిచ్చాయి.

తొలిప్రదర్శన వీరేశలింగం కళాసమితివారి "ఫర్ సేల్" రచయిత శశిమోహన్, దర్శకత్వం మోహన్‌కుమార్ పిళ్ళె. ఇందులో నిరుద్యోగిగా విజయ శేఖర్, పోలీసుగా వాసుదేవరావు పల్లెవాడుగా మోహన్‌కుమార్ పిళ్ళె. యజమాని. ఆఫీసరు. పాలకుడుగా పాత్రలు సత్యనారాయణ మోహన్‌రావు. కార్మికనాయకుడు. విదేశీయుడు పాత్రలు పాల్ విజయకుమార్. నిరుద్యోగి. కార్మికుడు. సామాన్యుడు పాత్రలు మదికుమార్ పోషించారు.

నిరుద్యోగి ఆక్రందన. పోలీసుల అక్రమార్జన. ఉద్యోగ నియామకాలలో అన్యాయాలు. ఫ్యాక్టరీయజమానుల నిర్దాక్షిణ్యం కార్మికనాయకుల స్వలాభాపేక్ష దేశపాలకుల దుశ్చర్యలు చక్కగా చిత్రింపబడ్డ రచన ఇది. ప్రత్యేకించి అపురూప సంపదగా దేశంలో

పెద్ద మ్యూజియంలో ప్రదర్శించవలసిన గాంధీ చిత్రించిన చిత్ర నాయకులు విదేశీయులకు అమ్మజూపడం ప్రేక్షకుల్ని కదిలించే సన్నివేశం. పల్లెవాడు పోలీసులతో మాట్లాడేటప్పుడు తెలంగాణా యాసతోను, నిరుద్యోగితో మాట్లాడేటప్పుడు సర్కారు యాసతోనూ మాట్లాడ్డం డైలాగు మాడ్యులేషనులో మంచి కృషికి నిదర్శనం. ఒకేరంగంమీద పార్కు. ఆఫీసు చూపడంలో లైటింగ్‌టెక్నిక్ ఫెయి లయ్యి చాలుసార్లు రసాభాసం అయింది. ఎంతజాగ్రత తీసుకున్నా లైటింగ్‌లో ఎఫెక్ట్ తేవడం కష్టం. ఇలాంటి వానికి సజెష్టివ్ స్టేజి వేస్తేనే సౌకర్యం. ఇది చాలా సులభం. పార్కుభాగానికీ, ఆఫీసు భాగానికీ మధ్య ఒకరిబ్బను కట్టేస్తే వీనిని ప్రేక్షకుడు వేరువేరు స్టేజీలుగా భావించుకోగలడు. చివరన ఈ పాలకులు గాంధీవేసిన బొమ్మనే కాదు గాంధీసంపాదించిన స్వాతంత్రాన్నికూడా అమ్మే స్తారని "ఇండియా ఈజ్‌ఫర్‌సేల్' అనే ముగింపు ప్రేక్షకులలో ఉత్కంఠను రేకెత్తించింది. పోలీసు స్వగతాన్ని ఆడిటోరియం లోని ప్రేక్షకుల నుద్దేశించిచెప్పడం. ఆఫీసరు పాత్రలో బిగింపు లేకపోవడం. చెయ్యిపోయిన కార్మికుడికి 10 రూపాయలు ఇవ్వవ లసినచోట ఒత్తిచెయ్యి అందించడం. అలాగే కార్మికునిచేత సంత కం పెట్టించి యిదుగో కాగితం. అని వట్టిచేయి అందించడం ఎబ్బె ట్టుగా ఉన్నాయి. నాయకుల కుండేవి హక్కులేకావు. బాధ్యతలు కూడా" అనేది యీనాటి నాయకులకు గట్టిగా తెలియవలసినమాట.

రెండవ ప్రదర్శన గౌతమీ కళాసమితివారి 'హుష్‌కాకి' రచన ఎమ్. బి. శ్రీరాం. దర్శకత్వం పి. రంగరాజు. ఇందు యువకుడు కె. శామ్యూలు. లచ్చిగాడుగా యుం. బాపిరాజు. కిట్టి గాడుగా పి. రంగరాజు. పెద్దమనిషిగా జి. అంకారావు నటించారు. ఒకపార్కులో 100 రూపాయల నోటుతో పర్సు పోగొట్టుకున్న నిర్భాగ్యుడైన నిరుద్యోగి దానికోసం ఆరాటంగా వెతుకుతుంటే

లచ్చిగాడనే భిక్షగాడికి దొరకడం. కిట్టిగాడు అనే మరో బిచ్చగాడు అది ఇచ్చే వేద్దామంటే అది దొంగతనంకాదు, దొరికిందిగనక తీసు కోవడం తప్పుకాదని దాచగా. అది కని పెట్టిన పెద్దమనిషి (దేశనా యకుడు) దాన్ని కాజెయ్యాలని దానికోసం లచ్చిగాడికి ఆశలు చూపి తనవైపులాక్కుని ప్రజాస్వామ్యంలో మెజారిటీ ఓటు ప్రకా రం నడవాలి గనుక తాము యిద్దరం ఒకేమాట అంటున్నాం గనుక ఆ నోటు తనదే అనడం. అప్పుడు కిట్టిగాడు అన్యాయమని లచ్చి గాడితో పోరగా లచ్చిగాడు అది ఆ యువకుడిదే అని నిజంవైపు మరలడంతో ఆగ్రహించిననాయకుడు అతన్ని గుండెలమీదతన్ని ఆవందా లాక్కుపోవడం. ఆ దెబ్బకు లచ్చిగాడు చచ్చిపోగా కిట్టి గాడు ఈ దురన్యాయానికి దుఃఖపిల్లుతూ ఈదేశంలో తప్పుచేసిన పెద్దవాడికి శిక్ష " ఇప్ కాకి " అంటూ రోదించడం – ఇదీ ప్రధాన కథ. ఇందులో బిచ్చగాళ్లు నాయకుడు కోరిన కోరికల్లా అప్పుడు చిల్లరకు ఏ వస్తువూ రావడంలేదు కనుక ఒకరూపాయకు తక్కువ లేకుండా ముష్టివెయ్యాలని చట్టంచేయమని కోరడం, ఏఅప్లికేషనూ ఏ సిఫార్సూలేకుండా ఈ దేశంలో వచ్చే ఉద్యోగం అడుక్కోవడం అనేవిసురువంటివి నేటి రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితిపై చక్కనిచురకలు. ఆద్యంతం ప్రదర్శన వేగంగా, బిగువుగా నడి చింది. రంగాలంకరణ బాగుంది. నటులు సహజంగా నటించారు. అయితే బిచ్చగాళ్ళ సినీమాపాత్రలు కొంచెం అతి అనిపించాయి.

మూడవ నాటిక అమృత ఆర్టు థియేటర్సు (ఎ. పి. పి. మిల్స్) వారి "క్షీరసాగర మథనం" హరనాథరావు దీనిని నాట కంగా వ్రాయగా భాస్కరరాజుగారు (తేటగుంట) నాటికగా మలి చారు. దర్శకత్వం : కె. కామేశ్వరరావు. భయంకరాచారిగా ఎస్. ఎస్. రామారావు, రంగాచారిగా జి. నాగేశ్వరరావు, అప్ప లాచార్యులుగా బి. వాణీశంకర్, క్షీరసాగరంగా కె. కామేశ్వరరావు సాలిగ్రాంగా వి. వి. అర్. ఆర్. కే. సుబ్బరాజు, రంగనాయకిగా

కుమారి ఉమ నటించారు.

భయంకరాచారి పరమ శ్రోత్రియుడు. సంప్రదాయాలకూ, ఛాందసాలకూ ప్రతినిధి. కొడుకు రంగాచారి షావుకారు గుమాస్తా. అసమర్థుడు. తండ్రి ఆజ్ఞలకు బద్ధుడు. రంగాచారి కొడుకు అప్పలాచార్యులు నిరుద్యోగి. మేనల్లుడు క్షీరసాగరం. కూతురు రంగనాయకిని నిర్దాక్షిణ్యంగా భర్త విడిచిపెట్టేస్తే పుట్టింట్లోనే ఉంటున్నది. ఆ కుటుంబం నిత్యం భుజించేది దారిద్ర్యం. ఆ ఇంట్లో సగభాగం కొనుక్కొని వుంటున్న సాలిగ్రాం భయంకరాచారి ఇంట పురాణ కాలక్షేపానికి వెడుతూ రంగనాయకితో ప్రేమ కలాపాలు సాగిస్తాడు. తత్ఫలితంగా ఆమె గర్భంధరించడం, దానికి కృద్ధుడైన భయంకరాచారి గర్భవిచ్ఛేదానికిమందు త్రాగించడం, ఆమె ప్రాణాపాయ స్థితిలో వుంటే, ఆమెకు మందిప్పించడానికే డబ్బులు లేక బాధపడుచున్న రంగాచారిని తనతండ్రి తద్దినానికి అప్పుతెచ్చి యివ్వలేదని భయంకరాచారి సాధిస్తుంటే, రంగాచారి నేటి మానవుడై కూతురు రంగనాయకిని సాలిగ్రాం కిచ్చి కులాంతర వివాహం చెయ్యడం, కులమత సంప్రదాయాలు జీర్ణించుకుపోయిన భయంకరాచారి దీన్ని భరించలేక శాపనార్థాలు పెడుతూ ఇంటిలో నుండి వెళ్ళిపోవడం- ఇది ఇతివృత్తం. ఇందు రచయిత కులవ్యవస్థను నిరసిస్తూ, క్షీరసాగరంవగైరా పాత్రలద్వారా ఎంత హేతుబద్ధంగా వాదించాడో ఆవ్యవస్థను సమర్థిస్తూకూడా అంత హేతుబద్ధంగానూ చెప్పించాడు భయంకరాచారి పాత్రద్వారా రచయిత. రచయిత శీలాన్ని శంకించడంకాదు గాని సరిగ్గాచూస్తే ఇందులో రచయిత మనస్సు ఏ వైపుకుమొగ్గిందీ అని! నేటి వుద్యోగాలలో రిజర్వేషన్లవంటివి ఇందు విమర్శకు గురికాబడ్డాయి. ఈ కథలో పరమశ్రోత్రియుడైన భయంకరాచారి భ్రూణహత్యకు పాల్పడతాడా అనేది విమర్శక దృష్టిని తప్పించుకోలేక పోయింది.

ప్రదర్శనలో స్టేజ్ బ్యాలన్సును కొంచెం దృష్టిలోపెట్టుకుని రిపీటెడ్ మూవ్మెంట్సులేకుండా చూసుకోవలసిన అవసరం వున్నది. సాలిగ్రాం డైలాగులు ఒకోసారి నాగరికంగాను. ఒకోసారి అనాగరికంగానూ వుచ్ఛరించడాన్ని సరిచేసుకోవాలి. దీన్ని హాస్యపాత్రగా తీర్చిదిద్దాలి అసలు రచయిత అభిప్రాయం ప్రకారం. క్షీరసాగరం కంఠం మైకుకు దూరంగా పేలవంగా వినిపించింది. రియాక్షన్స్ క్విక్ గా వస్తేనేగాని రచనకు న్యాయంజరగదు. రంగనాయకి, భయంకరాచారుల వేషధారణ. ఉచ్ఛారణలే ఈ ప్రదర్శనకుఊపిరి.

నాల్గవది వంశీ ఆర్ట్సువారి 'పాపందేవుడు' నాటిక, రచయిత గన్ని కృష్ణ. దర్శకత్వం రాజకుమార్ మోహన్. ఇందు తండ్రి పాత్ర ఆదినారాయణ. కొడుకుపాత్ర (సత్యం) వి. సుబ్బారావు. కూతురు (సుజాత) పాత్ర కుమారి ఉమ పోషించారు. దొంగబాబాల దుశ్చర్యలమీద. వారినినమ్మే మూఢభక్తులమీద ఇది బాంబ్. ఒకే విషయాన్ని రెండు మూడుసార్లు చెప్పించడం తగ్గించి రచనలో మాటల పొదుపు పాటిస్తే కథకు బరువువచ్చేది. పాత్రల కదలికలు. సంభాషణల ఉచ్ఛారణ సహజంగా ఉండేటట్టుచూసి "వేగం' పెంచాల్సిన అవసరంఉన్నది. ఉద్యోగం ఇంటర్వ్యూకు వెళ్ళేకొడుకును తండ్రి బాబాగారి కుంకుమ పెట్టుకువెళ్ళమంటే „ ఇంటర్వ్యూకు కావలసింది కుంకుమకాదునాన్నా ఎం త్రం వుష్ప " అనే మాట. "బయటకు వెళ్లేదారిలేక చీకటి గుహలో కొట్టుమిట్టాడు తున్నాడు దేవుడు " అని గర్భగుడిలో దేవుణ్ణిగురించి విసిరిన మాటలు, ఇంటర్వ్యూ అధికారిని చంపివేసి వచ్చినకొడుకుని తండ్రి "ఎంతపాపం చేసేవురా: " అని మందలిస్తుంటే "పురాణాల్లోని ఎందరు దేవతలు ఎందరు రాక్షసుల్ని చంపలేదు!" అనేవి కొన్ని చెణకులు.

ప్రదర్శనలో కొడుక్కి ఉద్యోగం వచ్చినట్టు. కూతురి పెళ్ళి కుదిరినట్టు చూపినతండ్రిఊహ చాలాఅద్భుతంగా వున్నది. వెంటనే

దానికి భిన్నంగా బాబాచేత శీలం చెరచబడ్డ కూతురు రావడం, ఇంటర్వ్యూకు వెళ్ళినకొడుకు ఆ అధికారిని చంపిరావడం, అవి ఎలా జరిగినవీ ఎ్రరలైటులో బాగాచూపారు. లైటింగ్ టెక్నిక్ విజయవంత మయింది ఈ నాటికలోనే. మానభంగం జరిగిపోయి వచ్చినకూతురు ముఖాన బొట్టుచెరగడం, జాకెట్టు చిరగడం, జుట్టురేగడం లాంటివి చూపి ఆ దుశ్చర్యను స్ఫురింప జేయవచ్చు. హత్యచేసి వచ్చిన కొడుకు బట్టలపైకూడా రక్తంమరకలు చూపవచ్చు కదా! ముగింపు లో తండ్రి కొడుకుల సంభాషణలో ‘‘అకృత్యానికి కారణం మూఢ త్వమేగాని దేవుడేంచేశాడు నాన్నా? అనేది బాగుంది.

అయిదవ ప్రదర్శన రవీంద్రా ఆర్ట్సువారి ‘‘పైడిరాజు’’ రచన ఆర్. వి. యస్ రామస్వామి. దర్శకత్వం టి. కె. సూర్య నారాయణ. అందు పైడిరాజుగా జమ్మిశ్రీ. శీనయ్యగా ఎ. వీర భద్రరావు, ఫకీరుగా కె. వి. రాఘవులు. నాగన్నగా కాకరాల. పోలీసుగా పుష్పరాజు. నాగరత్నంగా శ్రీమతి జయా శ్రీనివాస్ నటించారు.

ఇది ప్రత్యేకించి వినోదంకోసం వ్రాసినా నాయకుడు పైడి రాజుకు పంచాయితీ ప్రెసిడెంటు గిరి రావడం, అతని అనాగరికపు పరిపాలన, పాలనలో భార్య జోక్యం నపుంసక బావమరిదికి ఉద్యో గం వెయ్యాలని పట్టుబట్టడం, అది ఎమ్. ఎల్. ఎ గారి బంధువుకు వెయ్యవలసి వున్నదని గుమాస్తా పోరుబెట్టటం, ఆ క్రిమినలు తొలగింపు, రౌడీబెదిరింపు, పదవికి రాజీనామా పగ్గె రాలతో మంచి హాస్యధోరణిలో నడిచింది. పైడిరాజు తూరుపుయాస, బావమరిది ఆనందం కొజ్జా చేష్టలు ప్రేక్షకులను నవ్వులలో ముంచెత్తాయి. భార్య నాగరత్నం కాళ్ళు పైకెత్తుకుని టేబులుమీద కూర్చున్నతీరు ప్రేక్షకులను యిబ్బందిపెట్టింది. అయితే ప్రేక్షకులు ఊహించిన ప్రమాదం జరక్కపోవడం అదృష్టం. నాగరత్నం ఒక్కొసారి కోస్తా భాష, ఒక్కొసారి తూర్పుయాస మాట్లాడడంలాంటివి సర్దుకోవాలి.

చివరి ప్రదర్శన ఆదర్శా ఆర్ట్స్ (ఎ. పి. పి. మిల్స్) వారి "కుక్క" నాటిక. రచన యండమూరి వీరేంద్రనాథ్. దర్శకత్వం శ్రీ బి. సత్యనారాయణ. ఇందు దొరపాత్ర బి. వి. రమణమూర్తి, జీతగానుగా బి. వి. రామారావునాయుడు, చిన్నదొరగా మాస్టర్ సాయిరామ్. పుస్తెలవాడుగా జి. భాస్కరరావులు నటించారు.

ఇది తెలంగాణా మాండలిక భాషతో కూర్చిన నాటిక. ధనవంతులు దరిద్రులను ఎలా కుక్కల్లా చూస్తున్నారో, వాళ్ళ ఎంగిలి మెతుకులు తిని వీళ్ళు ఎలా కుక్కల్లా సేవిస్తున్నారో, వడ్డీ వ్యాపారుల కబంధహస్తాల్లో పేదలు ఎలా బలై పోతున్నారో తెలిపే ఇతివృత్తం. ప్రదర్శనలో పుస్తెలవాడు పాత్రధారి శాంత, కరుణ. వీర. భయానక రసాలు పోషించిన తీరు, వేషం, భాషోచ్చారణ (యాస) బాగుంది. పెద్దదొర వేషం బాగానే ఉందిగాని యాసను అనుకరించడంతోపాటు మాటలు తెలిసేలా మాట్లాడడం అవసరం, చిన్నదొర భాషలోకూడా యాస ఉండాలి.

మొత్తంమీద ఈ ఆరునాటికలు వైవిధ్యంగల ఇతివృత్తాలు గలవి. అందువల్ల ప్రేక్షకులు ఆసక్తిగానే చూశారు. అక్కడక్కడ ఈ ప్రదర్శనల రక్తిని పాడుచేసినవి ముఖ్యంగా లైటింగ్ ఎఫెక్ట్స్, నటులకు కొందరికి మైక్ సెన్స్ లేకపోవడం అనేవి. అయినా ఈ ప్రదర్శనలు సగటు స్థాయికి అటు యిటుగా ఫరవాలేదనిపించాయి. బహుమతి ప్రదానం సుప్రసిద్ధ సినీరచయిత భమిడిపాటి రాధాకృష్ణచేత జరిపించడంతో ఈ పోటీల విశిష్టత పెరిగింది. కార్యక్రమాలు అన్నటైముకు అరగంట ఆలస్యంగా ప్రారంభించడం వయూరి అలవాటుకు భిన్నం.

"కోస్తావాణి" ప్రారంభోత్సవ కానుకగా మయూరి కళా సమితి ఈ సారి నాటికలవైపు దృష్టిమరల్చి ఈ పోటీలు ఏర్పాటు చేసినందుకు నాటకరంగం అభినందిస్తున్నది. "కోస్తావాణి" ఉన్నత శిఖరాల కెదిగాక మయూరి మళ్ళీ ఒకసారి రాష్ట్రస్థాయి పోటీలు ఏర్పాటు చేస్తుందని ఆశిద్దాం.

— కోస్తావాణి
(1983 మార్చి 27 - 1988 మార్చి 28)



# పరిషత్తు నాటకాలు - ప్రజల నిరాదరణ

తెలుగు నాటకరంగం పద్యగద్యాత్మక నాటకాలతో ప్రారంభమై క్రమంగా యిప్పటికి వచన నాటకాల దగ్గరకు వచ్చినిలిచింది. ఆదిలో అన్నీ పౌరాణిక నాటకాలే - పురాణాలలోని కథలూ, చరిత్రలోని ఘట్టాపు సాంఘిక యితివృత్తాలూ తీసికొని చంలూవుగా వ్రాశారు ఆది నాటక కర్తలు. ఆకోవలోవే యీనాటికీ జనసందోహాన్ని ఆకట్టుకుంటున్న 'ఉద్యోగవిజయాలు', 'హరిశ్చంద్ర", 'గయోపాఖ్యానం', 'లవకుశ', 'బాలనాగమ్మ", 'రామాంజనేయయుద్ధం', 'చింతామణి' వగైరా-

"సంగీత మపిసాహిత్యం సరస్వత్యాస్తన ద్వయం". ఈనాటకాలు సంగీత సాహిత్యాలు రెండూకలిసి. రాగరస రంజితమై ఆబాలగోపాలానికి ఆదరణీయములయ్యాయి

క్రమపరిణామదశలో పద్యాలులేకుండా పూర్తివచనంతో సాంఘికనాటకాలు రావడం ప్రారంభించాయి. ఇది యించుమించు 'కన్యాశుల్కం'తో ప్రారంభం. సంగీతానికిచోటుపోయింది-వట్టివచన సాహిత్యమే నాటకాన్ని నిలబెట్టవలసివచ్చింది. ఆంధ్రనాటక కళా పరిషత్తు ప్రారంభించిన నాటినుండీ పోటీలుకూడా యీ సాంఘిక వచన నాటకాలకే పరిమితమై యివి పుంఖాను పుంఖంగా వచ్చేశాయి. పరిషత్తుల్లో ప్రయిజులు వచ్చిన చాలనాటకాలు దేశంలో విశృంఖలంగా ప్రదర్శింపబడి ప్రజాదరణ పొందుతుండేవి. పది సంవత్సరముల క్రితంవరకూ - అన్నా చెల్లెలు, పల్లెపడుచు. కీర్తిశేషులు, కప్పలు, కమల. ఇదేమిటి, చిల్లరకొట్టు చిట్టెమ్మ యిత్యాది. ఇది 10 సంవత్సరముల క్రితంసంగతి - విచిత్రం! ఈ పది సంవత్సరాలలోనూ పరిషత్తులు మరీ ఎక్కువ జరుగుతున్నాయి - ఎన్నో

నాటకాలు ఉత్తమ నాటకాలుగా అక్కడ ప్రైజులు తీసుకుంటు న్నాయి. కాని సమాజంలో ఏ ఒక్కదానికీ ఆదరణలేదు. ఫలానా పరిషత్తులో ప్రైజు వచ్చిందని వినడమేగాని అది మరల ఫలా నాపట్టణంలోగాని, ఫలానా పల్లెలోగాని ప్రదర్శింపబడింది అనే మాట వినబడ్డంలేదు. దానికి కారణం రచయితా, నటుడా, ప్రేక్షకు డా - అనేది యీనాడు ఆలోచించవలసిన విషయం.

రచనా విషయంగా చూస్తే 10 సంవత్సరాల క్రితం వరకూ మన నాటకాలలో కథాబలంపుష్టిగా వుండేది, సాహిత్యపు మెరుపు వుండేవి. ఆతరువాత నాటకాలు 'ప్రయోగాత్మకము' అనేపేరుతో సామాన్య ప్రేక్షకునికి సులువుగా అందని టెక్నిక్‌కు విలువయిచ్చి 'ఆ', 'ఊ', 'ఏ'లే సాహిత్యంగా వచ్చేస్తున్నాయి. చిన్న Incident ని సాగదీసి సాగదీసి 3 గంటలసేపు చూపించడానికి ప్రయత్నిస్తు న్నారు పాశ్చాత్య ధోరణుల ననుకరిస్తూ. అయితే తెలుగుప్రేక్షకుడి నాడిపేరు. ఉగ్గుపాలనుంచీ ముసలమ్మలు మనల్ని కథలతోనే పెంచారు. అందుచేత ఈ చెవులు దానికే అలవాటుపడ్డాయి. అందు చేత కనీసకథలేని నాటకం ఇక్కడిప్రేక్షకుడు చూడడు. నేటినాట కాలలో చాలవరకు కథనామమాత్రమే అని చెప్పాలి.

ఇక నటనవిషయం పరిశీలిస్తే అంతా ఊహాజనితమే - అన్నీ అనుకోవడమే-ఈ పద్ధతి ప్రయోగాత్మక నాటకాలకు ప్రాణం. ఇది ఇంచుమించు "మరో మొహంజొదారో" నుండి ప్రారంభమయింది. ఈ అనుకోవడ మనేది ముందే స్క్రిప్టు చదివేసి వుంటాడు గనుక పరిషత్ జడ్జీ అనుకోగలడు గాని సామాన్య ప్రేక్షకుడు ఈ అను కోవడాలు, వినుకోవడాలు లాంటివానికై తనబుర్రను పనిచేయించ లేడు. అంత లోతులకు ఆలోచించనూలేడు అయినా ప్రయోగాత్మ కాలపేరు చెప్పి నటన ఊహకందకుండా వెర్రితలలు వేస్తుంటే కొంచెం ఆలోచించగలిగినవాడే సతమతమై పోతున్నాడు, యిక సామాన్యు డేంచూస్తాడు?

అందుచేత రచయితలూ, నటులూ ప్రయోగాల పేరుతో గగన విహారం మానేసి భూమిమీదికి దిగి సామాన్యుడి విజ్ఞానపు పరిధి లోనికి వచ్చి విహరిస్తే అది సమాజానికి ఉపకరిస్తుంది. అలాకాక "Art for art Sake" 'అని ఆకాశ భాషణం చేస్తే జనం యిక ముందుకూడా 'హరిశ్చంద్ర' 'చింతామణి' వంటి నాటకాలకే వస్తూ మొర్లు కొడుతుంటారు. ఆధునికనాటకాలు పరిషత్తు బల్లలకే పరిమితమైపోయి సంతోషించుకోవాలి. ఈ సంతోషం స్వకుచమర్దనమే అవుతుంది.

— సమాచారం
(1988 నవంబర్ 16)



# ఆగండి! కొంచెం ఆలోచించండి!

గయోపాఖ్యానం నాటక ప్రదర్శనలో గయుడు "పాతాళమునకేగి బ్రతుకవచ్చు-నటన్న" అనే పద్యం చదువుతూ చెయ్యి పైకెత్తి చూపిస్తాడేమిటండీ పాతాళం పైనున్నట్టు! " అన్నారు శ్రీ వాత్సవగారు. పాతాళం తెలుగు నాటకరంగానికి పైనే ఉంది గనుక అన్నారు శ్రీశ్రీగారు.ఒకనాడు తెలుగు నాటకరంగం మూడు పువ్వులు ఆరు కాయలుగా వెలిగింది. అంతకుముందు తెలుగు నాటకం స్వరూప స్వభావాలు తెలియడం లేదుగాని 13 వ శతాబ్దంలో యక్ష గాన రూపంలో ప్రదర్శనలు విస్తృతంగా ఉన్నట్టు చారిత్రకాధారాలు చాలా ఉన్నాయి. కలాపాలు, కురవంజిలు వీనిలోవే. నడి రోడ్డునే రంగస్థలంగా చేసుకుని కాగడాల వెలుతురులో యీ ప్రదర్శనలు జరిగేవి. అలాగే ఆముదం దీపాల కాంతిలో జరిగిన తోలు బొమ్మలాటకూడా. సంభాషణా సంవిధానంలో అంతా నాటకమే. విమర్శనాత్మక దృష్టితో చూస్తే జముకుల కథల్లోకూడా నాటక ప్రక్రియ విశేషంగానే కనిపిస్తుంది. కొందరు పాత్రలు వేషధారణ చేసి సంభాషణలు జరపడం, కొందరు జముకులు వాయిస్తూ కథనడపడం నాటక ప్రక్రియలోని భాగాలే. ఈ జముకుల కథలు తోలు బొమ్మలాటలు కూడా తెలుగు నాట అనేది ప్రసిద్ధమైనవే. ఇలా చూసుకుంటూవస్తే తెలుగు నాటక వికాసం 20 వ శతాబ్ది పూర్వార్థంలోనే వేగం పుంజుకుందని చెప్పాలి. నక్కల భాగవతులు 'చెంచులక్ష్మి' నాటకం యిలాయి బుడ్డి దీపాల వెలుగులో రోడ్డుమీదే ఆడేశేవారు ఏ బల్లా లేకుండానే. క్రమంగా మాదిగ భాగవతుల 'శశిరేఖా పరిణయం' వంటి నాటకాలు రంగాన్ని కొంత ముందుకు నడిపాయి. కాగడాలు, యిలాయి దీపాలకు బదులు పెట్రోమాక్సులైట్లు వచ్చాయి. రంగ స్థలానికి బల్లలస్టేజి వచ్చింది.దీనికి కొంచెంముందు పల్లెలలో 'లంకాదహనం' వంటి భజన నాటకాలుకూడా ముమ్మరంగా

నడిచాయి. దీపపు సెమ్మెల వత్తుల కాంతిలో భజన కీర్తనలతో యివి జరిగేవి. మాదిగ భాగవతుల తరువాత ప్రదర్శనల స్థాయిని మరింత ముందుకు నడిపించినవారు ఎర్రగొల్లలు. వీరి ప్రదర్శనలలో పెట్రో మాక్సులైట్లు బదులు గేస్‌లైట్లు చోటు చేసుకున్నాయి. పద్యాల్లో రాగా లాపన పల్లె జనుల నుఱ్ఱూత లూగించేవి. ఊరూరా వీరి 'కనకతార. 'జయంత జయపాల' నాటకాలే. ఇదే కాలంలో సురభినాటకాలు పైర వర్కు. సెట్టింగులు ప్రవేశపెట్టి తెలుగు నాటకరంగంలో విప్లవాన్ని తీసుకొచ్చాయి. ధార్వాడ కంపెనీవారి రాకతో తెలుగు నాటకరంగం తిరిగినమలుపు రంగం థియేటరుకెక్కడం. బళ్ళారి రాఘవాచా ర్యులు, వై. భద్రాచారి, స్థానంవంటి మహానటులు నటించే "రామ దాసు. హరిశ్చంద్ర" రోషనారవంటి నాటకాలకు టిక్కెట్లు దొరికేవి కావు. "హాలునిండినవెనుక ఆయా తరగతుల గట్లపై కూర్చుండ వలెను" అనేది ఆ రోజుల్లో కరపత్రాలపై పరిపాటిగా కనిపించేది. అద్దంకి, బందాలాంటివారు భావ ప్రధానంగా పద్యాల్ని అంతంత మాత్రరాగంతో చదువుతుంటే బెల్లంకొండ, రామనాథశాస్త్రి, యస్.పి. లక్ష్మణస్వామి. రఘురామయ్య నూరిబాబు వగైరాలు సంగీతానికి ప్రాధాన్యమిస్తూ చదివేవారు. అబ్బూరిషణ్ముకి వచ్చిన తరవాత రాగప్రాధాన్యం మరీ పెరిగింది. ఆలాపన ప్రధానం, పద్యం అప్ర ధానం. ఇప్పుడే నాటకరంగం పూర్తిగా కంట్రాక్టర్ల చేతుల్లో పడి పోయింది. నలుగురు కృష్ణులు. ముగ్గురు అర్జునుళ్ళు. ఇద్దరు ధర్మ రాజులు. యిలాగ పేరెన్నికగన్న నటుల కాంబినేషన్లతో కంట్రాక్ట ర్లకు కనకవర్షమే—

ఇదే రోజుల్లో ఆంధ్రనాటక కళాపరిషత్తు సాంఘిక నాటకాల పోటీలు ఏర్పాటు చెయ్యడంతో ఆత్రేయ, పినిశెట్టి, కొర్రపాటి వంటి వారు సాంఘిక నాటకాలూ. నాటికలూ పుంఖాను పుంఖంగా వెలువ రించారు. డాక్టర్ సన్యాసిరాజు. డాక్టర్ రాజారావు కె. వెంకటేశ్వర

రావు గార్లు యీ సాంఘిక నాటకరంగాన్ని ఆంగిక సాత్విక వాచకాభి నయాల్లో ఎంతో ప్రభావితంచేశారు అయితే క్రమంగా సినీమాల తాకి డికి నాటకరంగం తట్టుకోలేక పోయింది. పౌరాణిక నాటకాలు దేవీనవ రాత్రి. గణపతి నవరాత్రి. శ్రీరామనవమి పందిళ్ళకు పరిమితమ య్యాయి. సాంఘిక నాటకాలు పరిషత్తులకు పరిమితమయ్యాయి. ఇప్పుడు 16 M. M. సినీమా రోడ్డుమీదికి వచ్చేయడంతో ఆ పంది ళ్ళలోకూడా అవకాశం దొరక్క వోల్టేజితక్కువ ట్యూబులైటులాగ ఆరిపోతే వెలగలేక మిలుకు మిలుకు మంటూ నానా హైరాన పడు తోంది పౌరాణిక నాటకరంగం. ఇక సాంఘిక నాటకాల పరిస్థితిచూస్తే ప్రయోగాల పేరుతో ప్రజలకి దూరమైపోయాయి. పరిషత్తుల కెళ్ళడం పెద్ద ఖర్చుతో కూడినపని. అందువల్ల మరీ కండూతి, ఆర్థిక సౌష్ఠవంగల వ్యక్తులున్న సమాజాలే వెళ్ళగలుగుతున్నాయి – వీనిని వేళ్ళమీద లెక్కించవచ్చు—

ఈ దీనావస్థకు కారణం సినీమాయేనా?....మరి తమిళనాడులో నాటకరంగం ఉజ్జ్వలంగా నడుస్తోందే! అక్కడకూడా సినీమాలున్నా యిగామరి! నటులు, నాటక ప్రయోక్తలు కొంచెం నిలబడి ఆలో చించండి—

— అబ్బూరికళాపరిషత్ సంచిక
(1986 నవంబర్ 1)

)○○○(

# 'శంకరాభరణం' లో అపశ్రుతులు

నేడు శంకరాభరణం ఎక్కడ చూసినా పొగడ్తలతో మారు మ్రోగుతుంది. ఈ తరుణంలో ఈ కళాఖండంమీద విమర్శ కూడా ఒకనిందే. గుణములేనిదే విమర్శింపరు. అనేది తెలిసికొంటే విమర్శను ఎవ్వరూ అపార్థంచేసికోవలసిన అవసరం వుండదు. సూక్ష్మంగా చెప్పాలంటే మురికిబట్టమీది మరకగూర్చి ఎవ్వరూ ఆలోచించరు. తెల్లబట్టమీది మరకగురించే ప్రశ్న—

ఇది ఎంతగొప్ప చిత్రమో చిన్నవాళ్ళనుండి పెద్దవాళ్ళవరకూ పత్రికాముఖంగానో, గోష్ఠులరూపంలోనో గండపెండేర సన్మానాల సందర్భాలలోనో ఎలుగెత్తిచాటి చెప్పేరు ఎందరో మహానుభావులు. అని మరలా చెప్పడం చర్వితచర్వణమౌతుంది. అందువల్ల ఆ భాగం వదిలేసి నాణేనికి రెండవవైపు చేసిన విశ్లేషణయిది.

## రచన

శంకరశాస్త్రి మాటలు చాలా ఉదాత్తంగా వున్నాయి. కాని అతని నోట వెలువడ్డ 'సాంప్రదాయం' అనేమాట భాషాదోషం. తెలుగులోగాని, సంస్కృతంలోగాని "సాంప్రదాయం" అనే శబ్దంలేదు. "సంప్రదాయం" అనాలి. లేదా 'స'కి దీర్ఘం పెట్టాలనుకుంటే 'క' ప్రత్యయంచేర్చి 'సాంప్రదాయకము' అనాలి.

## ఔచిత్యం

ఉదాత్తుడైన శంకరశాస్త్రి హంతకురాలైన నర్తకికి శిక్ష తప్పించడం కోసం కేసు మరొకరి మీదకు నెట్టించడం ఆ పాత్ర ఉన్నతికి కళంకం. హత్య ఒకరుచేస్తే శిక్ష మరొకరు అనుభవించడం ఏమి న్యాయం! ఇక్కడ శంకరశాస్త్రిపాత్ర తన ఔన్నత్యాన్ని కోల్పో

యింది. పైగా యిది మానరక్షణకో ప్రాణరక్షణకో చేసిన హత్య కాదు, శంకరశాస్త్రి ఫోటోను తన్నినందుకు ఆవేశంలో చేసిన హత్య. ఇలాంటి హత్యానేరం చేసిన వారిని తప్పించి మరొకరిమీదికి మళ్ళించడానికి అవకాశాలు మన న్యాయ చట్టంలో వున్నాయా! అలా చూపడం మన న్యాయస్థానాలనే అవమానించినట్టవుతుంది అతి ముఖ్యమైన ఈ మలుపు వేరేవిధంగా త్రిప్పడానికి ఆలోచించవలసింది.

## మాటలు

ప్లీడరు అల్లురామలింగయ్య శంకరశాస్త్రికి తన భార్యను గురించి చెప్పేటప్పుడు "మీ మరదలు" అంటాడు. కాని ఆమె శంకర శాస్త్రిని 'అన్నయ్య' అంటుంది. ఈ మాటల పొందిక సరిగాలేదు.

## పాటలు

'శంకరగళనిగళము' "శ్రీహరిపదకమలము" అనే పాటలో గళము అంటే కంఠము, నిగళము అంటే సంకెల అనిఅర్థం. ఇది షష్ఠీసమాసంగా చూస్తే శంకరాభరణ రాగం శంకరుని కంఠానికి సంకెల అనే సూచనభావం వస్తోంది. పోనీ బహువ్రీహిగాచూస్తే శంకరగళనిగళము అంటే శంకరుని మెడలోని పాముగా భావించాల్సివుంది. పాము ఈశ్వరుని కంఠానికి ఆభరణమేగాని "సంకెల" అనడం అర్థవంతంకాదు. అలా కవి సమయాల్లో కూడా ఎక్కడా చెప్పబడలేదు. అయినా చేతులకు వేసేదాన్నే సంకెల అంటారు. కంఠానికి వేసేది ఉరిత్రాడు.

ఇక "శ్రీహరిపదకమలము" కూడా బహువ్రీహిగా పామునుద్దేశించే ప్రయోగించి వుంటారనుకుంటే పాము విష్ణువుకు పాన్పు మాత్రమే. (శేషపాన్పు). పాదాలక్రింద వుండేదికాదు.

కాబట్టి ఈ మాటలో శబ్దగాంభీర్యమే గాని అర్థగౌరవంలేదు. ఈ పదలాలిత్యానికితోడు అర్థంకూడా సరిపడితే అద్భుతంగా వుండేది.

## పాత్రలు

శంకరశాస్త్రి చిన్నప్పటినుండీ తన కూతురుకిచ్చిన సంగీత శిక్షణ అపారం. గొంతులోతు నీళ్ళలో గడగడవణికించే చలిలో గోదావరిలో సాధన చేయిస్తాడు. అంతటి సాధన చేసినాకూడా పరిపూర్ణత సాధించినట్టులేదు పెళ్ళి చూపులనాటి సంఘటన చూస్తే. ఇక కుర్రవాడు శాస్త్రి దగ్గర నేర్చుకున్న కాలంఅతి స్వల్పం. మరిఎలా అంతటి విద్వాంసుడు కాగలిగాడు! ఇక్కడ అసాధారణమైన అతని సంగీత ప్రావీణ్యం సమంజసంగాలేదు. చిన్నప్పటినుంచీ తల్లి నేర్పుతున్నట్లు అంతకుముందే 2,3 షాట్స్ పెంచి చూపిస్తే ఈ సందేహానికి అవకాశం లేకుండాపోయేది.

## సంగీతం

ఇది శాస్త్రీయసంగీతచిత్రమనేదానికంటే శ్రావ్యసంగీత చిత్రమంటే సరిపోతుంది. శాస్త్రీయసంగీతం ప్రారంభిస్తే జనం పరుగులెత్తుకుపోయే దశనుంచి దాన్ని మార్చి సారళ్యంతెచ్చి దానికి శ్రావ్యత అపాదించడం ఈ చిత్రంప్రత్యేకత. శాస్త్రీయసంగీతమంటే పూర్తి కర్నాటకబాణీ–జనం పారిపోయేది. కాని యిది జనం వింటున్నారు. కనుక 'శ్రావ్యంసంగీత చిత్రం' అంటే అతివ్యాప్తిఅవ్యాప్తి లేకుండా వుంటుంది.

## నాట్యం

మంజుభార్గవి నర్తించి చూపిన వానిలో ముఖ్యంగా మధ్య శిల్పాలదగ్గరి కొన్ని భంగిమలు. ముద్రలు మాత్రమే మనలో ముద్ర వేసుకున్నాయి. వీనికితోడు హృదయాన్ని జలదరింపజేసే ఒకటి

రెండు త్వరగతి నృత్యాలు జోడించివుంటే నాట్యచిత్రంగా కూడ "నౌరంగ్" 'ఝనక్ ఝనక్ పాయిల్ బాజే'. చిత్రాలస్థాయిలో నిలబడగలిగేది.

## బేక్‌గ్రౌండు

శంకరశాస్త్రిని బెంగుళూరు సన్మానానికి పిలవడానికొచ్చింది. తెలుగు ఏ కొంచెంకూడా రాని ఓ కన్నడిగుడు. ఆ సన్మానం కన్నడిగులే చేస్తున్నారన్నాడు-కాని శాస్త్రి అక్కడికి వెళ్ళినప్పుడు చూపిన అవాతావరణంలో గాని, చేరిన మనుషుల మాటల్లోగాని, కట్టుబొట్టుల్లో గాని, కనీసం బేనర్సులోగాని కన్నడదేశ స్ఫూర్తి ఎక్కడా కనబడలేదు. షూటింగ్‌కు ఎలాగా బేలూరు దాకా వెళ్ళారు గనుక ఆషాట్ అక్కడే గల బెంగుళూరులోనే తీసుంటే ఆ వెలితి దొరికేదికాదు. తెలుగు బేనర్సుతో పాటు కన్నడభాషలోకూడా కొన్ని బేనర్సు పెట్టివున్నా కొంతసరిపడేది.

## నటన

రంధ్రాన్వేషణ అనుకోకపోతే శ్రీ సోమయాజులు వయసులో నాగయ్యగారు వేమన, పోతన, త్యాగయ్యలవంటివానిలో చేసిన నటనకు సూక్ష్మానుకరణ కొట్టవచ్చినట్లు కనిపించింది. అంటే ప్రధాన ధారిలో పాత్రలో సృజనాత్మకత లోపించింది. సోమయాజులుగారు ప్రతిభగల నటుడు. నాటకరంగం మీద తనకొక బాణీవున్నవాడే. స్థూల దృష్టికి కనబడే ఈ చిన్న అనుకరణ విస్మరించి నటించినా రాణింపునకు లోపం వుండేదికాదు.

## సందేశం

ఇందులో కళాత్మవిలువలు తప్పించి సందేశంకోశం వెతకొద్దు. అంటే యిది సామాజిక స్పృహలేని కథ అవుతుంది. అనగనగా ఒక శాస్త్రి. అతనికి ఒక కూతురు. అని ప్రబంధరీతిలో చెప్పుకుపోయే

ప్రశ్నించరాని 16 వ శతాబ్దపు కథగా మాత్రమే మిగులుతుంది. ఇలా చేస్తే సమాజానికి నల్లమందు మాత్రవేసి నిద్రపోనున్నట్టూ, రోమ్‌నగరం తగులబడిపోతుంటే నీరో చక్రవర్తి ఫిడేలు వాయించు కుంటున్నట్టూను.

అలాకాకుండా ఈనాడు సమాజం సతమత మవుతున్న సమస్యలకి పరిష్కారం కావ్య సందేశం కావాలి, అది ప్రయోజనాత్మక మవుతుందిఅనికూడా ప్రాక్టికల్‌గాఆలోచించి ప్రవేశపెట్టి అక్కడక్కడ కనిపించే అసహజాలు.శాస్త్రిగారు గుర్రబగ్గీలు మీదతిరగడం వంటి Anachronismss లాంటివి తొలగించివుంటే అప్పుడిది అంత ర్జాతీయంగా మన స్థాయికి తప్పకుండా బావుటా ఎగరేసి వుండేది.

చక్కని రసాత్మకమైన ఈ చిత్రంలో దర్శకప్రతిభ అద్భుతం. దానికి బహుమతి రాకపోవడం ఆశ్చర్యం.

-- సమాచారం
(1980 జూన్ 22)



# శ్రీ శ్రీ తో రెండురోజులు

మార్చి 2 న కాకినాడలో శ్రీ శ్రీ సప్తతి పూర్తి ఉత్సవాలు చేస్తున్నారని తెలిసింది. డా॥ చిరంజీవినీ కుమారి ఆ విషయం నాకు ఉత్తరం వ్రాస్తూ దానికి శ్రీ శ్రీ గారిని ఆహ్వానిస్తున్నట్లు కూడా తెలిపారు. ఇది మిత్రులు శ్రీ వై. ఎస్. నరసింహారావుగారితో చెప్పాను. ఈ సమయంలో శ్రీ శ్రీ గారిని వీరేశలింగ స్మారకోపన్యాసాలకి యిక్కడికొక్కడా పిలిస్తేనో అన్నారు. మంచి ఆలోచన-యుగపురుషుడు. సంఘసంస్కర్త. వీరేశలింగంపై మహాకవి శ్రీ శ్రీ ప్రసంగం-ఓహ్! అంతకంటే కావలసిన దేముంది?- కాని శ్రీ శ్రీ వస్తాడా?

నరసింహారావుగారిది నిశ్శబ్ద సంగీతం-ఆచార్య దామెర్ల వెంకటాప్రుగారిచేత ఉత్తరం వ్రాయించారు' ఆ తరువాత ఆంధ్ర కేసరి యువజన సమితిలో ఆధునిక కవితారీతులపై ప్రసంగించడానికి ఎచ్చిన చిరంజీవినీ కుమారితో ' శ్రీ శ్రీ గారిని రాజమండ్రి కార్యక్రమానికి కూడా ఒప్పించండి' అని చెప్పారు.

మూడు మాసాల అనంతరం ఫిబ్రవరి 23 వ తేదీన శ్రీ శ్రీ గారినుండి ఉత్తరం వచ్చింది. తాను వస్తున్నట్లు, 3 లేక 4 వ తేదీన సభను యేర్పాటు చేసుకోవచ్చునని అందులో శ్రీ శ్రీ పేర్కొన్నారు.

అదే రోజు డా॥చిరంజీవినీ కుమారినుండి కూడా ఉత్తరం వచ్చింది "ఆయన యితరుల కార్యక్రమాలేవీ అంగీకరించలేదు. మీ ఆహ్వానం మాత్రమే అంగీకరిస్తున్నానని నాతో చెప్పారు-" అని.

సంబరపడ్డాం-కానీ-సమయం చాలా తక్కువ - ఆలోచనలో పడ్డాం. అదృష్టవశాత్తు రాజమండ్రి చైతన్యస్రవంతి 'సమాచారం'

ఆంజనేయులుగారి చెవిని వేశారట యీ వార్త నరసింహారావుగారు. అంతే ఏర్పాట్లన్నీ చక చకా నిముషాలమీద జరిగిపోయాయి. అదీ ఆంజనేయులుగారి ఆడంబరం లేని ఆర్గనైజేషను.

3 వ తేదీ మధ్యాహ్నం శ్రీ శ్రీ గారు సతీ సమేతంగా రాజ మండ్రి వచ్చారు. అది మొదలు ఆంజనేయులుగారి పుత్రుడు సుబ్రహ్మణ్యంగారు. చిరంజీవిగారు. నరసింహారావుగారు శ్రీ శ్రీ గారి కుటుంబ సభ్యులై పోయారు. శ్రీ శ్రీ 3 వ తేదీ పూర్తిగా విశ్రాంతి తీసుకొని 4 వ తేదీ వీరేశలింగం స్మారకోపన్యాసం మాత్రమే చేస్తా రనేది షెడ్యూలులో ప్రోగ్రాం. అయితే ఆ రాత్రి 6 గం॥కు శ్రీ శ్రీ గారితో 'get together' ఏర్పాటు చేస్తే బాగుంటుందని స్థానిక సాహితీప్రియుల అభిలాష.

కాకినాడ నుంచి అలిసిపోయి వచ్చిన మనిషి ఆ వయస్సులో యిప్పటికిప్పుడు ఈ క్రొత్త కార్యక్రమానికి ఒప్పుకుంటారా అనేది నా సందేహం—కాని ఆశ్చర్యం! అడగ్గానే సరేనన్నారు. వయస్సు ఎంత పెరిగినా మనసు యువకత్వంతో ఉరకలేస్తూనేవుంది. "సమా చారమ్" మేడమీద "ఇష్టా-గోష్ఠి' ప్రారంభమయింది. ప్రశ్నలు మొదలు పెట్టేరు. అందులో నా ప్రశ్న-

"మీరు నాయింటిపేరు ప్రపంచం ప్రజలు నా కుటుంబం అన్నారు. ఇది ఎవరో అధ్యాత్మిక తత్వవేత్త వేదాంత ధోరణిలా వుందితప్ప శ్రీశ్రీ మాటలాలేదు—"అన్నాను. 'ఎందుచేత?"'అన్నారు" 'శ్రీ శ్రీ సాహిత్యసారం అదికాదు,నా యింటిపేరు విప్లవం, కష్టజీవులు "నా కుటుంబం-" అంటేనే శ్రీ శ్రీ అన్నాను. దానికి చిన్నగానవ్వి విప్లవం 'నా ఆశయం'-అని ఇంకా ఏదో చెప్పబోతుండగా ఎవరో మరో ప్రశ్నతో విషయం మార్చేశారు.

'ఒక మనిషి జన్మదినోత్సవాలు ప్రజలు చేసుకోవడానికి ఏదో ప్రత్యేకత కావాలికదా! మీ 60 వ జన్మదినోత్సవం ప్రజాసాహితీ ఉత్సవంగా చేసుకోడానికి కారణం మీరు సృష్టించిన మహాప్రస్థానం. మరి నేటి మీ 70 వ జన్మదినోత్సవానికి వున్న ప్రత్యేకత ఈ పదేళ్ళలో మీరు చేసిన ఘనకార్యమేమిటి? అని మరో ప్రశ్న విసిరాను. వెంటనే యిచ్చిన సమాధానం "ఈ పేరు మీదన్నా వామపక్షాలన్నీ కలసే అవకాశం వుంటుందికదాఅని ఆశించానంతే' అన్నారు. కాని-చివరన- ముద్రణకు సిద్ధంగానున్న వారి' మరో ప్రస్థానంలోనిగేయాలు "విప్లవం. విప్లవం."ఊగరా; ఊగరా." విన్నతరువాత ఈ పదేళ్ళలో మరో మహాజ్వాల సంచలనకావ్యం సృష్టించారని తెలిసికొని చకితుణ్ణయ్యాను.

ఆ గేయాలు ఆయన పాడుతుంటే ఆ గాత్రంలోని గంభీరత ఉద్రేకపు ఊపు శ్రీ శ్రీ యిప్పటికీ యువకుడే అనిపించాయి.

మనిషికి మెళ్ళో దండవేసి. కాళ్ళకు ,దణ్ణం, పెట్టడం వాకు రాజమండ్రిలోనే ఎక్కువగా కనిపించింది. మీటింగుల్లో ఇది చూస్తున్నప్పుడు మనసులోనే నవ్వుకుంటుంటా. నా ఉద్దేశంలో ఎదుటిమనిషికి పెట్టే నమస్కారం అతని మంచిమనస్సుకో, అతని గొప్ప మేధస్సుకో, మాత్రమే. అటువంటప్పుడు హృదయానికో, శిరస్సుకో నమస్కారం చేస్తే అర్థం వుందిగాని కాళ్ళల్లో ఏముంటుందని బూడిద 'లలిత కళానికేతన్‌లో సన్మానాలు గొప్పగా చేసేవాళ్ళమని మిత్రులు కొండవల్లి భాస్కరావుగారంటుంటే" 'దండేసి కాళ్ళకు దణ్ణం పెట్టడమేనా" అని 'జోక్' చేస్తుండేవాణ్ణి, కాకినాడ సన్మానంలో కొందరు కాళ్ళకు నమస్కరిస్తే శ్రీ శ్రీ గారు సరిగ్గా యిలాగే విముఖత ప్రకటించడంతో రేపటి రాజమండ్రి సంగతి ఎమిటాఅని కొంచెం ఆలోచనలో పడ్డాను. అదృష్టం! ఇక్కడ కాళ్ళకు "దణ్ణ" పెట్టినా కామెంటు చెయ్యకుండా వూరుకున్నారు. అమ్మయ్య అనిపించింది.

ఈగోష్ఠిలో ముఖ్యవిషయ మేమంటే Dialectical Materialision (గతి తార్కిక భౌతిక వాదం) గురించి 'హెగెల్' దగ్గరనుంచి ప్రారంభించి మార్క్సిజం, మావోయిజంల గూర్చి సులువుగా అందరికీ అర్ధమయ్యేలా చెప్పేరు. మార్క్సిజం మాకే తెలుసునని, దాన్ని బ్రహ్మపదార్థంగా మార్చివేసి Confuse చేస్తున్న సోకాల్డు మార్క్సిస్టు పండితుల్లా కాకుండా మార్క్సిజం పారాయణ గ్రంథం కాదనీ Guide Line మాత్రమే అని సూక్ష్మంగా విప్పిచెప్పారు. ప్రపంచ సాహిత్యంలో వచ్చిన ఉద్యమాలు వివరిస్తూ తన మహా ప్రస్థానంలోని 'కుక్కపిల్ల, సబ్బుబిళ్ళ, అగ్గిపుల్ల అనేది క్యూబిక్ పొయెట్రీకి చెందినదన్నారు. సమానత్వాన్ని గూర్చి మాట్లాడుతూ All are Equal అనేది తనభావమని ఆచరణాత్మకంగా అందరితోనూ క్రింద కూర్చునే గోష్ఠి నిర్వహించారు.

ఈ సమయంలో శ్రీ శ్రీ నోటినుంచి జారిపడ్డ ఒకమాట అందర్నీ చకితుల్ని చేసింది. శ్రీ శ్రీ తనముందు కార్యక్రమాల్ని గూర్చి చెబుతూ 'చలం' అరుణాచలం వెళ్ళిపోయినట్లు తనకూ్కడా ఏకాంతం కోసం ఎక్కడికో వెళ్ళిపోవాలనుందన్నారు. దీనితో అందరూ శ్రీ శ్రీ చలంలా వేదాంతి కాబోతున్నారా అనే ఆలోచనలో పడ్డాం. కాని తరువాతి ప్రసంగాలు పరిశీలిస్తే ఆ ఏకాంతం మరో మహాకావ్యసృష్టి రచనకోసమని అర్ధమయింది.

ఒకప్రశ్నకు జవాబుగా జాతీయ భాషగా హిందీకంటే తెలుగును చేస్తేమంచిదన్నారు. ఇది తనొక్కడి అభిప్రాయమేకాదని పరదేశీయుడైన ప్రొఫెసర్ హాలీస్ కూడా యిలాగే అన్నారని వారిమాటల్ని ఉదహరించారు. దీనికి కారణం - ఈ హిందీ భాష దేశంలో చాలా పరిమిత జనులకు సంబంధించినదని కూడా అన్నారు. నిజమే - వాస్తవానికి యిది హిందీయే కాదు. 'ఖడీ బోలీ' అనే మాండలికం. ఏదేమైనా శ్రీ శ్రీగారు కోరినట్లు తెలుగు జాతీయ భాషా స్థాయికి

చేరాలంటే ముందుయిది గ్రాంధిక భాషావాదుల గాఢపరిష్వంగం లోంచి బయటపడి సారళ్యం సంపాదించుకోవాలి.

మరునటిరోజు ఉదయం 9 గంటలకే కార్యక్రమం ప్రారంభం. నరసింహారావుగారు నన్నుగూర్చి శ్రీ శ్రీగారికి పరిచయం చెయ్యబోతున్నారు. ఇంతలో నాచేతిలోని స్వేచ్ఛ వారికిచ్చాను. వెంటనే ఇది నాకు పంపేరుకదూ! అన్నారు. ఏనాటి మాట! ఎంత జ్ఞాపకం! 2 సంవత్సరాల క్రితం మిత్రుడు ఇజ్జాడ వెంకటాద్రిపూ నేనూ కలిసి రాసిన ఆధునిక కవితాసంపుటి 'స్వేచ్ఛ' ఒక ప్రతి అవాడు శ్రీశ్రీ గారికి పంపాం. ఆయన తిరుపతి Campలో చదివి వెంటనే దానిపై తన ఆనందం వ్యక్తం చేస్తూ ప్రియమైన కవులారా! (Dear Poets) అని సంబోధిస్తూ ఒక అభినందన ఉత్తరం వ్రాశారు. ఆ మహాకవి మమ్మల్ని కవులుగా గుర్తించడం, అందులోనూ అంతటి అభినందనతో ఎవరికైనా అయితే గర్వం కలుగుతుందేమోగాని మాకు మాత్రం భయం వేసింది మాముందు రచనలు రావలసిన స్థాయి గురించి. రెండేళ్ళనాడు అందిన మా పుస్తకం గురించి అంతగుర్తుగా ఇప్పుడు ఆయన చెప్పడం చూస్తే 70 ఏండ్ల వయస్సులో కూడా ఆయన జ్ఞాపకశక్తి ఎంతచురుగ్గా పనిచేస్తుందో ఊహించొచ్చు.

9-30 గంటలకు హితకారిణీ సమాజంవారి ఆధ్వర్యంలో నున్న వీరేశలింగం మ్యూజియం, వీరేశలింగ దంపతుల సమాధులూ చూపించాం. తన నిశితమైన చూపులతో అన్నీ పరిశీలించారు. రాజ్యలక్ష్మి కళాశాలకూ వెళ్ళాం. అంతర్ కళాశాలల మహిళాక్రీడోత్సవాలకై దేశం నలుమూలలనుంచీ వచ్చిన క్రీడాకారిణులను, కళాశాల విద్యార్థినులను ఉద్దేశించి ప్రసంగిస్తూ కందుకూరి ఆశయాలను నెరవేర్చడమే ఈ తరానికి తానిచ్చే సందేశమన్నారు. తాను ఆశావాదిననీ మానవ జాతికి ఉజ్వల భవిష్యత్తు ఉందన్న నమ్మకం తనకు కలదనీ చెప్పి "మరో ప్రస్థానం"లోని గేయాలు వినిపించారు.

గౌతమీ గ్రంథాలయానికి తీసికెళ్ళాం. స్పెషలాఫీసర్ శ్రీ పి. యస్. దేవదాస్ గ్రంథాలయంలోని వివిధ విభాగాలూ చూపించారు. బయలుదేరుతూ అక్కడున్న తాళపత్ర గ్రంథాలను అడిగి తెలుసుకున్నారు.

అనంతరం ఆంధ్రకేసరి జూనియర్ కాలేజీ దర్శించారు. కాలేజీ డాబామీదకు రాగానే గోదావరి ప్రకృతిదృశ్యం చూస్తూ పులకించినట్లు అలా నిలుచుండిపోయారు మూడు నిమిషాలు. క్రింద కోట గోడ–ఎదుట గోదావరిలో పయనిస్తున్న పడవలు–దూరంగా రోడ్–కం రైలు బ్రిడ్జి - ప్రక్కన పాత బ్రిడ్జిపై వస్తున్న రైలురొద - చేపలు పడుతున్న జాలరులు - రాళ్ళుమోస్తున్న కూలీలు - స్టీములాంచీ ప్రయాణపు కూత - బహుశః-

'శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనేలేదు'

అనే తన "ప్రతిజ్ఞ" ఖండిక జ్ఞప్తికి వచ్చి వుంటుంది. "సైన్సు విభాగం ఏది?"అన్నారు. అక్కడ లేబరేటరీలో 10 నిముషాలు అన్నీ చూస్తూవారుచెప్పింది జాగ్రత్తగా వింటూ, శాస్త్ర విజ్ఞానం మీద తనకున్న ప్రత్యేక మక్కువను వ్యక్తంచేసారు. కారు బయలుదేరింది– దారిలో జరుగుతున్న పురావస్తు త్రవ్వకాలను చూసి లభ్యమైన వస్తు సముదాయాన్నీ వాని చారిత్రక కాలాన్నీ తెలుసుకున్నారు.

మధ్యాహ్నం 12 దాటింది. ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలలో శ్రీ శ్రీ ప్రసంగం. "సరస్వతీ సన్మాన చక్రవర్తి" అని శ్రీమతి కోడూరి లీలావతిగారిచే పరిచయం చేయబడిన శ్రీ గ్రంధి సుబ్రహ్మణ్యంగారు ఔచితినెగిరి శ్రీ శ్రీ కి ఎర్రశాలువా కప్పేరు. శ్రీ శ్రీలో ఆవేశం పెల్లుబికింది. ఈ దేశంలో విప్లవం వచ్చి తీరుతుంది దీన్ని ఎవరూ ఆపలేరు. బీకర్ లో నీరుపోసి క్రిందలాంపు పెట్టి వేడి

చేస్తే ఆ ద్రవ పదార్థం వాయుపదార్థంగా అవుతుంది. అంటే స్వరూపం మారిపోతుంది. అలాగే విప్లవం వల్ల భూస్వామ్య వ్యవస్థపోయి సామ్యవాద వ్యవస్థ తప్పక వస్తుంది అన్నారు. ప్రస్తుతం ఓరియంటల్ కళాశాలలో Text Book గా పెట్టిన తన 'మహాప్రస్థానం' పై ప్రసంగిస్తూ తన కవితారీతికి మార్గదర్శకుడు 'గురజాడ' అని, తాను మార్గాన్ని వెడల్పు చేశానంతే అన్నారు నిరాడంబరంగా. 'మహాప్రస్థానం'లో రియలిజాన్నీ, సామాజిక వాస్తవికతను ఆరాధించానని. 'బాటసారి' ఖండిక వివిధ దృశ్యాల చిత్రీకరణ అని చెప్పారు. ఇక్కడే 'కవి' అంటే ఎవరు అనే ప్రశ్న వచ్చింది. దానికి సమాధానంగా శ్రీ శ్రీ 'కష్టజీవి' కి కాపలాగా వుండేవాడే కవి అన్నారు. శబ్దపరంగా చూస్తే కష్టజీవిలో మొదటి అక్షరం "క", చివరి అక్షరం "వి". రెండూ కలిపితే కవి. అర్థసార్థక్యం కూడా అద్భుతంగా వుంది. శబ్దార్థ చమత్కృతి శ్రీ శ్రీకే చెల్లు. 'ప్రజ' గురించి చెబుతూ 'ప్ర' అంటే ప్రశ్నలు. 'జ' అంటే జవాబులు అని మరో చమత్కారం విసిరారు. మరో క్రొత్త ప్రయోగం.... వ్యక్తికి బహువచనం "శక్తి" అన్నారు. ఇది నన్నయ్య ఆంధ్ర శబ్ద చింతామణిలోగాని, చిన్నయ్య బాల వ్యాకరణంలో గాని చెప్పలేదు. బహుశ సంప్రదాయదాసులు గుండెలు బాదేసు కుంటారేమో! హేట్సాఫ్ శ్రీ శ్రీ....

విద్యార్థుల కోరికపై విప్లవం ఏడుందిరా ఉరికొయ్యనంటుకొని ఊగరా.... అన్నగీతాలు పాడి, ఆ కాలేజీ విజిటర్స్ బుక్‌లో తన అభిప్రాయం వ్రాశారు.

అక్కడి నుండి గౌతమీ విద్యాపీఠం (ఓరియంటల్ కాలేజి) విద్యార్థుల అభ్యర్థనపై అక్కడికి వెళ్దాం అన్నాం. శ్రీ శ్రీగారు చిరాకుపడతారేమో అని ఒకవైపు సందేహం. సమయం 2 గంటలు దాటింది - యింకా భోజనాలు చెయ్యలేదు. అయినా ఆయన చిరునవ్వుతో సరే అన్నారు.

ఆ పండితులకు కొండెక్కినంత సంబరం అయింది. అక్కడి విద్యార్థులనుద్దేశించి ప్రసంగిస్తూ "విద్యార్థుల్ని కలుసు కోవడమంటే కాదు, లేదు అనేమాట నాకలవాటు లేదు. విద్యార్థుల మధ్య నేను యువకుడిగా ఫీలవుతాను - మీ ముఖారవిందాల్లో నాకు భవిష్యత్తు కనుపిస్తుంది - నేను ఆశావాదిని - ఎన్ని దెబ్బలు తిన్నా నేను నిరాశలో కుంగలేదు - కందుకూరి వీరేశలింగంగారి ఆశయాన్ని ముందుకు తీసుకుపోవాలనేదే నా సందేశం - వారు మూఢ నమ్మకాలమీద తీవ్ర మైన దాడిచేశారు. బాల్యవితంతువుల దురవస్థచూసి యిది చాలా అన్యాయం దానికి బాధ్యులం మనం - వారికి పునర్వివాహం జరిపి తీరవలసిందే - వారిని యావజ్జీవ ఖైదీలుగా చేయడం తప్పు అని ఛాందసుల్ని చీల్చి చెండాడే"రన్నారు. "మిమ్మల్ని కలుసుకోవడం చాలా ఆనందంగా" వుంది అని ముగిస్తు ఆ కాలేజీ విజిటర్సు బుక్‌లో విద్యార్థులకు ప్రేరణగా ఈ క్రింది వాక్యం వ్రాశారు.

"అజ్ఞానంతో పోరాడాలి, విజ్ఞానం పెంపొందించాలి" శ్రీ శ్రీ-

అక్కడి నుండి రాగానే పేపర్‌మిల్లు కల్చరల్ యూనిట్‌వారు సమావేశము ఏర్పాటుచేసి శ్రీ శ్రీగారిని కొన్నిగేయాలు పాడమని, రికార్డు చేసుకుంటామని కోరారు. ఉదయం నుండీ ఊపిరి సలపని కార్యక్రమం - భోజనం కాలేదు. అయినా అలాగే లేచివచ్చి పాడడం ప్రారంభించారు. ఒకటా రెండా! పదా పదిహేనా! బహుశా సుమారు పాతిక. ఎంత ఓర్పు ఈయన విప్లవకవి శ్రీ శ్రీ యేనా! ఎంత Flexibility! యిప్పటికి ఆయననోటినుండి ఒక్కమాట కూడా కాదు, లేదు రాలేదు. గొప్ప అదృష్టం ఆయన భార్య శ్రీమతి సరోజినీ శ్రీశ్రీ గారు మా కార్యక్రమా లన్నిటికీ అనుమతించడం.

5 గంటలకు సతీసమేతంగా శ్రీ శ్రీగారు వీరేశలింగపురమందిరానికి వచ్చారు. ఎంతో ఉత్సాహంగా ఎందరితోనో కరచాలనం

చేశారు. మీటింగ్ ప్రారంభ మయింది. శ్రీశ్రీగారికి స్వాగతం చెప్ప డానికి వేదికమీదికి నన్ను పిలిచారు. నేను వెళ్ళి మహా ప్రస్థానం అమృతజల్లుల్లో ఊపిరి పోసుకున్న నేను ఆయన మహాప్రస్థానంలోని విప్లవగీతంతోనే స్వాగతం పలుకుతానని ఉద్వేగంతో 'మరో ప్రపంచం' గీతం ఆలపించి క్రిందికి దిగివస్తే శ్రీమతి సరోజినీ శ్రీశ్రీగారు ఎంతో ఆశ్చర్యం ప్రకటిస్తూ విప్పారిన నేత్రాలతో "ఏమిటీ మీరేనా ఆ గీతం అంత అద్భుతంగా పాడింది! యిప్పటివరకూ మాతో సుతిమెత్తగా కలిసి తిరిగిన రామకృష్ణారెడ్డేనా మైకుముందు ఈ అగ్నిని కురిపించింది!" అని ఎంతో అప్యాయంగా అభినందించారు. యిది నాకు ఒక మధురస్మృతి. మరల రైలు స్టేషన్‌లో శ్రీశ్రీగారి సమక్షంలో ఆమె నన్ను గురించి మాట్లాడుతూ "ముఖస్తుతి అనుకోకపోతే మళ్ళా చెప్పాలనిపిస్తోంది, మీరు చాలాబాగా పాడేరు, చాలాబాగా మాట్లాడేరు. మీ పాటల్లో మాటల్లో వాడీ వేడీ వుంది. నాకు చాలా సంతోషమయింది" అంటుంటే, శ్రీశ్రీగారు కళ్ళజోడు తీసి ప్రసన్నంగా నా పైకి ప్రసరించిన చూపు, మెరుస్తున్న చిరునవ్వు నన్నాశీర్వదిస్తున్నట్లనిపించాయి.

శ్రీశ్రీ టౌన్‌హాలులో వీరేశలింగం స్మారకోపన్యాసమిస్తూ "కారణజన్ముడు వీరేశలింగం. ఆయన పట్టనిసాహిత్య ప్రక్రియలేదు. తీవ్ర ప్రతిఘటనలను ఎదుర్కొంటూ మూఢాచారాల మీద ధ్వజ మెత్తిన మహావిప్లవ వీరుడు అని జోహారు లర్పించారు.

శ్రీశ్రీ ప్రసంగాలలో చాలా చోట్ల detachment, deviation కనుపించాయి. దానికి కారణం కొంత మంది వయసు పెరగడంవల్లనేమోఅని భావించారు. కాని ఆయన గుండెల్లో బందీగా వుండిపోయిన ఎన్నో విషయాలు నేను ముందంటే నేను ముందని ఒకదానితో ఒకటి పోటీపడి త్రోసుకు రావడానికి చేస్తున్న ప్రయత్నాలే ఈడీవియేషన్స్,

డిటాచ్‌మెంట్సు అని నా అభిప్రాయం. అలాగే ఏ విషయం మొదలు పెట్టినా అది అనంతంగా సాగిపోతోంది. ఇది వయస్సు చాదస్తం అని ఎవరైనా అంటే అది మేధా శక్తి మీద ఒక అవగాహనలేని మాటంటాను. ప్రపంచ విజ్ఞానమెంతో ఆయన బుర్రలో కూరుకు పోయింది. అది తోడే కొద్దీ పూరుతోంది, అందుకే ఏటాపిక్ తీసుకున్నా కావాలని త్రెంచితే తప్ప ఆగడంలేదు. పండిన విజ్ఞానంగల ప్రజ్ఞావంతులకేయిది సిద్ధిస్తుంది. అదే ప్రస్తుత శ్రీ శ్రీ-

రాజమండ్రి స్టేషన్‌లో శ్రీ శ్రీగారు వెయిటింగ్‌రూమ్‌లో వెయిట్ చేస్తుండగా ఎవరో మురార్జీ ప్రసక్తితెస్తే ఆయన వదలిన ఒక చెణుకు "మూత్రపానంచేసి జీవించడంకంటే మత్తుపానంచేసి మరణించడమే మేలు" అని.

శ్రీశ్రీ దంపతులకు బండిలో 'కుపే' రిజర్వు చేయించడానికి సాయపడిన శ్రీ భైరవస్వామి, శ్రీవెంకటస్వామిలను పరిచయం చేసినపుడు శ్రీశ్రీ 'కుపేకుబొకే' అనిఛలోక్తి విసిరి తన దగ్గరున్న బొకేలు వారికి Present చేశారు.

'సమాచారమ్' ప్రతినిధి శ్రీ సుబ్రహ్మణ్యం "నేటి తరానికి మీరిచ్చే సందేశం ఏమిటని అడుగగా వారి బుక్కులో యీ క్రింది విధంగా వ్రాశారు.

'ఈనాటి యువతరానికి నేనిచ్చే సందేశం ఒక్కటే – దేనినీ గుడ్డిగానమ్మవద్దు. అన్నిటినీ నిశితంగా పరిశీలించే వైజ్ఞానిక దృష్టిని పెంపొందించుకోండి"
– శ్రీ శ్రీ

అలాగే రాజమండ్రి టౌన్‌హాల్ ట్రస్టుబోర్డు విజిటర్సుబుక్ శ్రీనరసింహారావు అందజేస్తే అందులో ఆయన రాజమండ్రి జీవనాడికి దర్పణంపట్టి, దానిని అక్షర రూపంలో యిలా నిక్షేపించారు.

This Town Hall is verily, the pride of your city, in as much as it is associated with the name of the greatest person of this century - Andhras are proud to claim the greatest Veeresaligam as one of their own.'

Sri Sri, 4-3-90

ఇటీవల శ్రీ నరసింహారావు 'దివిలి' గ్రామం వెళ్ళినప్పుడు అక్కడ నిర్వహింప బడుతోన్న హైస్కూలును సందర్శించగా ఆహెడ్మాష్టరు వారి సావనీర్ యిచ్చారు. అందులో ఆ గ్రామంలో జన్మించిన ప్రఖ్యాతినందిన ప్రముఖులతో శ్రీశ్రీ కూడా కలరు. దీన్ని శ్రీశ్రీ ఇంతకు ముందు చూడలేదు. శ్రీనరసింహారావు ఆ కాపీ శ్రీశ్రీకి అందజేయగా అనిర్వచనీయమైన ఆనందంతో తీసుకున్నారు. ఈ అనుభూతి అందరికీ సమానమే గదా!

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'

ఇక్కడ ప్రసంగాలలో శ్రీశ్రీ తానొక నాటకం వ్రాయదల చినట్లు చెప్పారు. రైలు బయలుదేరబోయే సమయం యింకా 5 నిమిషాలుంది. చిరంజీవిగారూ, సుబ్రహ్మణ్యంగారూ నన్ను పిలిచి ఆయనతో నాటక విషయం మాట్లాడండి అన్నారు. శ్రీమతి శ్రీ శ్రీగారు కూడా ఆసక్తి కనబరచారు. వెంటనే శ్రీ శ్రీగారిని ఈ ప్రస్తావనలోకి దింపాను. వారు వ్రాయబోయే నాటక యితివృత్తం స్పృశించారు. నాకున్న నాటకానుభవం ప్రకారం ఎలా వ్రాస్తే ప్రదర్శన సౌలభ్యంగా వుంటుందో - పరిమితమైన పాత్రలు, ఒకే స్త్రీ పాత్ర, ఒకే సెట్టు గాప్ లేని Run వగైరా విషయాలపై వివరణలిచ్చి ఒక్క పరిషత్తుల దృష్టితోనే కాకుండా ఊరూరా ఆ నాటకం ఆడేటట్లు అందరూ ఆడ గలిగేటట్లు వ్రాయాలన్నాను. శ్రీమతి సరోజినీ శ్రీశ్రీగారు స్క్రిప్టు తయారయిన వెంటనే ముందు మీకే పంపిస్తామన్నారు. అంతకంటే ఆనంద మేమిటి ఒక ప్రోత్సాహిక ప్రయోక్తకి! బండి బయలు దేర

బోతోంది. శ్రీమతి శ్రీశ్రీగారు 'ఈ రెండురోజులూ రాజమండ్రిలో మీ అందరితో చాలా 'హోమ్లీ' గా గడిచిపోయింది. వీలైతే మరోసారి రావాలని కూడా అనిపిస్తోంది. ఇది శ్రీశ్రీగారి మాట' అనిచెప్పి, 'మీరు మద్రాసు వస్తే తప్పక మా యింటికేరండి' అని ఆప్యాయంగా ఆహ్వానిస్తుంటే బండి బయలుదేరి వెళ్ళింది. వారి మాటలు యింకా మా గుండెల్లో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

-- సమాచారం
(23-3-80, 29-3-80, 5-4-80)



# కవితా విపంచి - సి. నా. రె.

"ఒక్కని ఆదరణలో లక్ష్మీ సరస్వతు లిద్దరూ సవతులుగా సఖ్యంగా కాపురం చెయ్యడం అపురూపం. నారాయణరెడ్డి ఇది సాధించిన దక్షిణ నాయకుడు" అన్నారు ఆ స్థాన కవి దాశరథి శ్రీ సి. నారాయణరెడ్డిని గురించి. అంతేకాదు, "అలనాటి నిజాం రాష్ట్రంలో తెలుగు సాహితీబావుటా నెగరవేసి తెలుగు చైతన్యానికి గొంతెత్తిన యువకుల్లో నారాయణరెడ్డి ప్రముఖులు. తిరుపతి వెంకట కవుల నావారాజ సందర్శనంవలె నారాయణరెడ్డి మెట్టని తెలుగు పట్టణం లేదు. సమైక్య రాష్ట్రానికి నారాయణరెడ్డి చేసిన కవితా కృషి ప్రశంసనీయం. చలనచిత్ర సీమలో కూడా వేలాది గీతాలు వ్రాసి ప్రజాకవిగా సుప్రసిద్ధుడయ్యాడు శ్రీ నారాయణరెడ్డి" అన్నారు దాశరథి మొన్న నారాయణరెడ్డిగారి 50వ జన్మదినోత్సవ సభలో -

"డా॥నారాయణరెడ్డి మాకు పుత్ర ప్రాప్యపరాజయానందము కలిగించిన శిష్య చూడామణి. ఆయన కవిత్వపు మెరుగులు సహృదయులకు కర్ణ భూషణములు. గురువులైన మాకు గర్వకారణములు" అన్నారు. ఆచార్య దివాకర్ల వెంకటావధాని కర్పూర వసంతరాయల గ్రంథ పరిచయంలో -

"ఈ తరము తెలుగు కవులలో ప్రథమ శ్రేణికి చెందినవారు శ్రీనారాయణరెడ్డి. పండితులుగా, విమర్శకులుగా, వక్తలుగా తెలుగు సీమలో వారిది సమున్నతస్థానం" అన్నారు శ్రీదేవులపల్లి రామానుజరావుగారు నారాయణరెడ్డిగారి 'గాంధీయానికి' తొలిపలుకులో.

నారాయణరెడ్డి అసమాన ప్రతిభావంతుడైన కవి, మేధావి, పండితుడు. ఇటువంటి సంయోగం అపూర్వం, అమూల్యం అంటారు శ్రీ పి. వి. రాజమన్నారు 'జాతిరత్నం' ముందుమాటలో - ఎవరీ

నారాయణరెడ్డి? సినీ లోకంలో సి. నా. రె. కవితా లోకంలో సి. నారాయణరెడ్డి విద్యాలోకంలో ప్రొఫెసర్ నారాయణరెడ్డి, ప్రాసంగిక ప్రపంచంలో సకలజన సన్నుతుడు నారాయణరెడ్డి -

కర్షక వంశంలో జన్మించి కవితా విపంచిని కమనీయంగా మీటి తన అమృతవాగ్ఝరిలో తెలుగు ప్రజల ఓలలాడిస్తున్న సజ్జన కవి పుంగవుడు. ఆయన పాటలో తెలుగు సరస్వతి గజ్జకట్టి ఆడుతుంది. ఆయన మాటలో వసంత కోకిల తీయగా పాడుతుంది. అవర్గళ మధుర మంజులమైన ఆయన గొంతులో కోటివీణలు రవళిస్తాయి. శతకోటి మల్లెలు గుభాళిస్తాయి. వక్తగానూ, వ్యక్తిగానూ ఆయన ఆకాశపు టంచుల కెదిగినవాడు. కమనీయ కావ్యసృష్టితో కవితా జగత్తులో తన కొక బాణీని సృష్టించు కొన్నవాడు. పరుష వచనం ఎరుగని ఆ గళం పలుకుతోంది లోకానికెప్పుడూ మంగళం. అందుకే ఆయన కావ్యాలు తెలుగు సాహితీ చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించు కొన్నాయి. "కర్పూర వసంతరాయలు," "నాగార్జునసాగరు," "విశ్వ నాథ నాయకుడు." "ఋతుచక్రం" మొదలగు కథాత్మక చారిత్రాత్మక గేయ కావ్యాలు. "జలపాతం," "తేనెపాటలు" మొదలగు గేయ సంపుటాలు. "రామప్ప" సంగీత రూపకం "అక్షరాల గవాక్షాలు" "మధ్యతరగతి మందహాసం" "మంటల్లో మానవుడు." "మార్పు నా తీర్పు" "జాతిరత్నం." 'ఎర్రగులాబీలు' వగైరా ఆధునిక కావ్యాలు "ఆధునికాంధ్ర సాహిత్యం" వంటి పరిశోధన గ్రంథాలు తెలుగు సాహితీ సరస్వతి కంఠసీమ నలంకరించిన మణిహారాలు. మంచి సంస్కారవంతుడు. యువకులకు మార్గ దర్శకుడు. మంచి పలుకు బడిగలమనిషి. శబ్ద చమత్కారం ఆయన సొత్తు. గాంధీపై వ్రాస్తూ ఆయన చేసిన శబ్ద చమత్కారం -

'బాపూ నువ్వు పుట్టినరోజు
హరిజనుడే పుట్టినరోజు
హరి జనుడై పుట్టినరోజు'

Brevity is the soul of Wit అనేది ఆయన కవిత్వంలో అడుగడుగునా కనిపిస్తుంది. వ్యర్థపదమనేది ఆయన ప్రసంగంలో వెదికినా దొరకదు. ప్రతిమాటా మనలో ఏదో ఒక అలౌకికానందాన్ని కల్గిస్తుంది. అలాగని ఆయన మితవాది కాదు- పచ్చి అభ్యుదయవాది -

"నిరుపేదకి ఉప్పైనా దొరకనిచోటు
రామరాజ్యమని పలికుట - పెదవులచేటు"

అనే ఆటంపేల్చే అభ్యుదయం ఆయన నిజహృదయం సామాజిక స్పృహ కల్గించే కవిగా అతని మాట -

"కణమాత్రమైన ప్రేమ కలగనివాడు దరిద్రుడు
తనలో విశ్వమ్మును పొదిగినవాడే సంపన్నుడు."

ఆయన స్వాతంత్రేచ్ఛకు మచ్చుతునక-
"ముచ్చటైన పచ్చిక బయళ్ళలో
విచ్చల విడిగా తిరిగే దెప్పుడో
కురిసే ముత్యాలవానలో తడుస్తూ
పరవశించే దెప్పుడో"
చైనా దురాక్రమణ సమయంలో -

"నెయ్యానికి భరతవాసి నిండు అమృతభాండం
కయ్యానికివస్తే యిది మండు అగ్నిగుండం
ఇటపుట్టిన శిశువైనా నిజం ఉక్కుపిండం
కబడ్దార్ చైనా" అంటారు ఉచ్ఛైస్వరంతో

పండిట్ నెహ్రూ మే 27న చనిపోయినపుడు నెహ్రూ పెంచిన గులాబీ విలాపం మనసును ద్రవింపజేసేటట్లు వ్రాస్తారు.

'ఎందుకు కన్నావమ్మా
నన్నెందుకు కన్నావమ్మా నీవు
ఒకరోజు ముందుగ
నీ ఒడిలో జన్మించినచో
కరుణామయుడౌ జవహరు
కరస్పర్శ నందియుందు
ఇపుడు తెలిసె తోటమాలి
ఈదిశకే రాబోడని
యిపుడు తెలిసె జాతినేత
మనకు యింకలేడని.'

ఇక సినీ వాగ్గేయకారుడుగా ఈయన ప్రవేశంతో సినీసాహిత్యం కొత్త విలువలు సంతరించుకొంది. నారాయణరెడ్డి కలం సినీ సాహిత్యాన్ని ఒక మలుపు తిప్పింది. ప్రణయం దగ్గర్నుంచి విప్లవం వరకూ యితివృత్తాలుగా నడిచిన వీరిపాటలు విని ఆనందించనివాడేడీ! లలితపదసమ్మేళనం. అద్భుతభావ గాంభీర్యం, మనోజ్ఞమైనశైలి, పాత్రోచితభాష ప్రతివాణ్ణీ యిట్టేపట్టుకుంటాయి.

శ్రీకృష్ణ పాండవీయం చిత్రంలో రాక్షసస్త్రీ 'హిడింబి' భీముణ్ణి చూసి ప్రణయగీతం-

"ఛాంగురే బంగారురాజా -
ఛాంగుఛాంగురే బంగారు రాజా"

ఈనాటికీ తెలుగు నాలుకలమీద నర్తిస్తూనేవుంది.

దుర్యోధన సార్వభౌమునికి స్వాగతం చెప్పేదృశ్యంలో.

'స్వాగతం సుస్వాగతం

కదనరంగ బాహుదండ ధృతగదాప్రకటపటు శౌర్యాభరణా

తలపులన్నీ పన్నీటి జల్లులై వలపులన్నీ విరజాజి మల్లెలై' అనే పదగుంఫనతో కూడినపాట తెలుగు ప్రాంగణాల్లో ప్రతిధ్వనిస్తూనే వుంటుంది.

'ఏకవీరలో' లో

"తోటలో నారాజు తొంగిచూసెను నాడు
నీటిలో ఆరాజు నీడ నవ్వేనునేడు
నవ్వులా అవి,కావు, నవపారిజాతాలు
రవ్వంత సడిలేని రసరమ్య గీతాలు

అనే గీతంలో అత్యున్నత భావ సంపద—

'చెల్లెలి కాపురం' లో—

'చరణ కింకిణులు ఘల్లు ఘల్లుమన
కర కంకణములు గలగలలాడగ
వినీల కచభర విలాసబంధుర
తనూలతిక చంచలించిపోగా
ఆడవే మయూరీ'

అని నాట్యదరువులకు సరిపడ చేసిన పద ప్రయోగం, ఎవరిచేత ఓహ్ అనిపించదు!

ఈ సాహితీ మయూరంచేత నేడు మయూరి కళాసమితి రాజమహేంద్రి శ్రీ వెంకటేశ్వరా ఆనం కళాకేంద్రంలో 'మధునాపంతుల సాహిత్యవ్యాసాలు' ఆవిష్కరింప చెయ్యడం రాజమండ్రి జనుల అదృష్టం. సాహితీ పిపాసుల భాగ్యం. ఈ సాహితీపురికి పండుగ. ఈలాంటి మహత్తర కార్యక్రమాల్ని అందిస్తున్న మయూరి కళాసమితి అధ్యక్షులు శ్రీ చింతల గోపాలరావు అభినందనీయులు —

-- సమాచారం
(1982 ఏప్రిల్ 7)



# సమాజాన్ని నిప్పులతో కడిగిన కవి జాషువా

"విశ్వమానవ సౌభ్రాతృతం, నిర్భీతిసంఘం నా ఆదర్శం. ఒక జాతికి ఒకమతానికి చెందిన కవిత్వాలు మంచివికావు. అవి కవిత్వాలే కావు. అలాంటివి వీలునామా కవిత్వాలంటాను. నా భావం సామాన్యుల కందివ్వడానికే ప్రయత్నించాను. గగన సంచారంలేని కవిత్వం నా లక్ష్యం" అంటారు జాషువా. బద్దలైన అగ్నిపర్వతం నుండి ప్రవహించే 'లావా' అతని కలంలోని సిరా. ఆకలితో, అవమానాలతో, అగౌరవాలతో రోదించిన గుండె ప్రసవించిన నెత్తుటి మంటలు ఆయన ఖండికలు. ఇది నిరుపహతి స్థలంబులో వ్రాసింది కాదు – నిరుపేద గుడిసెలో వ్రాసింది. ఇది కడుపు నిండిన కవిత్వం కాదు కడుపుమండిన కవిత్వం. ఫిరదౌసీ, నేతాజీ, బాపూజీ, గబ్బిలం వంటి గొప్ప కావ్యాలు తెరచాటు వీరాబాయి లాంటి నాటికలు కల కాలం నిలిచిపోయే ఎన్నో ఖండికలు వ్రాశారు. ముఖ్యంగా ఫిరదౌసీ, గబ్బిలం కావ్య జగత్తునే కుదిపి వేశాయి.

ఒకనాడు గజినీ మహమ్మదు ఫిరదౌసీ కవిని తన ఆస్థానానికి పిలిచి "షానామా" అనే గ్రంథాన్నిరచించమని దానికి ప్రతిఫలంగా పద్యానికొక దీనారటంకం ముట్ట జెబుతానన్నాడు. ఫిరదౌసీ ఆ గ్రంథాన్ని పూర్తిచేసి సభకు తీసుకురాగా రాజు వెండి నాణేలివ్వ బోయాడట.

వానిని గ్రహించుట కిష్టంలేని ఫిరదౌసీ వానిని కూడా వలదని ఆ రాజు వద్ద వుండనొల్లక సకుటుంబంగా స్వగ్రామమైన 'దూసు' పట్టణానికి వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళ తరవాత రాజు తన తప్పు తెలిసికొని ఫిరదౌసీకి బంగారు నాణాలు పంపాడు. కాని అంతకు ముందే ఫిరదౌసీ చచ్చిపోయాడు. అతని కుమార్తె ఆ ధనమును అంగీకరించలేదు. ఇదీ ఆ కావ్యం. మానమర్యాదలు విడిచి దూషణలు, యీసడింపులు దులిపేసుకుంటూ శ్రీమంతుల చుట్టూ సిగ్గువిడిచి

ప్రదక్షిణలు చేసే కవి బృందానికి ఆత్మగౌరవాన్ని ఉద్బోధించే ఆదర్శ కరుణ రసకావ్యం ఫిరదౌసి.

ఇక గబ్బిలం దగ్గర కొస్తే గుణాన్ని బట్టి గాక కున్ని బట్టి మానవుల హెచ్చుతగ్గుల నిర్ణయించే వ్యవస్థను తూర్పార బడుతూ వ్రాసిన కమనీయ కావ్యంయిది. కడజాతి వానికి సంఘం చూపిన నిర్దాక్షిణ్యాన్ని కడిగిన అద్భుత కావ్యం. భారత భూమిలో కడగొట్టు బిడ్డడైన అరుంధతీ పుత్రుడు తన దుస్థితిని కైలాస పతికి చిన్నవించ వలసినదిగా గబ్బిలం ద్వారా పంపిన సందేశమిది. కడ జాతివాని గాలి సోకగానే "నాల్గు పడగల హైందవ నాగరాజు కసిరి బుసకొట్టు" అంటారు కసిగా. "ఆలయంబున నీవు వ్రేలాడు వేళ శివుని చెవి నీకు కొంత చేరువుగ నుండు" "పూజారి లేని వేళ విన్నవింపుము నాదు జీవిత చరిత్ర" అని చెబుతారు. గబ్బిలం గర్భగుడిలో దేవుడిదగ్గర యదేచ్ఛగా తిరుగుతుంటుంది. అందుచేత గుడిలో దేవునికి ఏదైనా చెప్పాలంటే దానికే మంచి అవకాశం వుంటుంది. కానీ పూజారి వుండగా చెబితే దానికి అతడు అడ్డుపడవచ్చు. (దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడుగా!) అందువల్ల పూజారి లేనపుడు భారతదేశం లో హరిజనుని దీనమైన హీనమైన నికృష్ట జీవితాన్ని వివరించ మంటాడు. యిప్పటివరకూ మేఘసందేశం, కీరసందేశం, మలయానిల [illegible] న్నాయి. కాని యీ గబ్బిలంసందేశం అనే ఊహ గొప్పగా వుంది. ఆపైన సందేశంలోని భావం మరీగొప్పగా వుంది. మొదటివి ప్రణయ సందేశాలైతే యిది జీవన్మరణ సందేశం. యివి ఇంత మేలుబంతులు గనుకనే ఫిరదౌసి హిందీలోకి, గబ్బిలం ఆంగ్లం లోకి అనువదించబడ్డాయి.

యిక ఖండికల దగ్గరకొస్తే అన్నీ ఆణిముత్యాలే "భరతమాత" అనే ఖండికలో -

"సింధు గంగానదీ జలక్షీరమిపుడు
కురిసిబిడ్డల పోషించుకొనుచునున్న
పచ్చిబాలింతరాలు మా భరతమాత
మాతలకుమాత సకల సంపత్సమేత"

అని జాతీయతపట్ల తన మమతనుచాటుకున్నాడు. రాజకీయాలను విమర్శిస్తూ స్వాతంత్ర్యం వచ్చాక దోపిడీ దారుల కబంధ హస్తాల్లో భారతమాత అనుభవిస్తున్న బాధలు చూసి "పరరాజ్యం పోయి ప్రజారాజ్యంవచ్చి కొందరికి మజా రాజ్యంగా మారింది." అంటూ వేస్తాడు చురక. దీన్నే దిగంబరకవి చెరబండరాజు "శ్రీమంతుల చేతుల్లో శీలంమరిచి నిద్రిస్తున్న యవ్వనం నీది" అంటాడు తన వందేమాతరం దిక్‌లో. మానవతకు విలువ నివ్వని సంఘ చర్యల్ని వాడికత్తులతో దుయ్యబడుతూ "ప్రతిమకు పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయింతుర్గాని దుఃఖిత మతులైనవారి పాత్రిలలో భరతమేదిని మెదుకు విదల్పరు" అంటాడు. మన తద్దినాలను పరామర్శిస్తూ –

"బ్రతికియున్న వేళ మెతుకుపెట్టనివారు
చచ్చేనేని దివము సల్పగలరు
స్వర్గలోకమందు సద్గతుల్ కల్గగా
విందు గుడువగలరు బంధుజనులు"

దీనినే మరోలా ఆలోచిస్తూ ఒక రచయిత్రి యిలా వ్రాసింది. "మన విశ్వాసాల ప్రకారం చచ్చిన మనిషి స్వర్గంలోనైనా ఉంటాడు, నరకంలోనైనా ఉంటాడు. లేదా మళ్ళీ పుట్టనైనా పుడతాడు. మనం యిక్కడ మూడు ముద్దల పిండాకూడు పెడుతున్నాం రమ్మంటే స్వర్గంలో వున్నవాడు ఆ సుఖాలను వదులుకొని వస్తాడా! నరకంలో వున్నవాడు నాకు మావాళ్ళు మూడుముద్దలేస్తువారని వెళ్ళి తినొస్తానంటే యమధర్మరాజు వదిలిపెడతాడా? అవేంగాకుండా మళ్ళీ జన్మ

గానీ ఎత్తివుంటే అక్కడెలాగూ తిండి తింటూనే బ్రతుకుతుంటాడు గదా యీ మూడు ముద్దలూ దేనికి?" అని

భారతదేశంలో కులాల పోరాటం గురించి చెబుతూ ,,మా చాకలివాడు మంగలియు జాతుల గొప్పదనాలకోసమై బాకులుపట్టి నిల్చెదరు" అంటారు, సమాజంలో దలితజాతులవాళ్ళంతా ఒక జట్టుగా నిలబడి పోరాడవలసిందిపోయి తాముఎక్కువంటే తాముఎక్కువంటూ పోట్లాడుకుంటుంటారు తమలోతాము అని వ్యంగ్యంగా ఎత్తి పొడుస్తారు. (కొన్ని చోట్ల మాలలు మాదిగలకు అగ్గి కూడా యివ్వరట.) వర్ణ వ్యవస్థను నిరసిస్తూ –

,,ముసలివాడైన బ్రహ్మకు పుట్టినారు
నలుగురు కుమారులను మాట విన్నాము కాని
పసరమున కన్నహీనుడభాగ్యుడైన
ఐదవ కులస్థు డెవడమ్మా సవిత్రీ"

అని ప్రశ్నిస్తాడు.

మతాల పేరుతోనూ, కులాలపేరుతోనూ ఈ దేశం ఎలా కుళ్ళిపోతోందో "ఇంటిగుట్టు" ఖండికలో యిలా ఎద్దేవా చేస్తాడు.

"దేవుడొకడు మాకు దేవళంబులు రెండు
దేశ మొకటి మాకు తెగలు రెండు
మాట వరుస కొక్క మతమందుమేగాని
కుల సమస్య వద్ద కుమ్ముదుమ్ము"

సమాజంలో స్త్రీ చైతన్యాన్ని ప్రబోధిస్తూ తమ హక్కులకై పోరాడమని యిలా మేల్కొలుపుతాడు–

"అబల యన్న బిరుద మంటించి కాంతల
స్వీయ శక్తులదిమి చిదిమినారు

సబల యన్న బిరుదు సాధించి హక్కులు
గడన చేసికొమ్ము కష్టచరిత"

'శిశువు' ఖండికలో –

"బొటన వేళ్ల ముల్లో కములచూసి లోలోన
ఆనందపడు నోరులేనియోగి, అమృతంబు
విషమును వ్యత్యాస మెరుగ కాస్వాదింప జను
వెర్రిబాగులాడు"

అని వ్రాసింది చదువుతుంటే యం. వి. వాఘన్ వ్రాసిన "రిట్రీట్" గుర్తొస్తుంది. "ఓ దేవుడా! నేను పుట్టినప్పుడు, పసితనంలో ఉన్నప్పుడు నాకు నువ్వు పువ్వులో, ఆకులో, ప్రకృతిలో, ఆకాశంలో అన్నిటా నువ్వు కనిపించేవాడివి. వానిలో నిన్ను చూస్తూ నవ్వుతూ నీతో ఆనందంగా ఆడుకునే వాడిని. ఎదిగే కొద్దీ యీ కల్మష ప్రపంచంలో కలిసిపోయి పాడుపనులలో నీకు దూరమయ్యాను. నువ్వు కనిపించవు. నాకు ఆనందం కరువయ్యింది. ఎదిగేకొద్దీ పెరుగుతున్న ఈ బరువు బాధ్యతల మధ్య నాకు ఏడుపే మిగిలింది. నాకు యీ ఎదగడం వద్దు. తిరిగి నా పసితనం నాకు ప్రసాదించు ప్రభూ!" అంటాడు వాఘన్. దీన్నే "ఎదగడానికెందుకురా తొందరా ఎదర బ్రతుకంతా చిందర వందర" అని వ్రాస్తాడు ఒక సినిమాకవి.

లోక వ్యవహారాల్ని చమత్కారంగా చెప్పి హృదయానికి హత్తుకొనేలా భూతద్దంలో చూపిస్తాడు నేర్పుగా బడి పంతుళ్ళ దైన్య స్థితిని గూర్చి –

"నల్లుల కుర్చీయును, బడి పిల్లల అల్లరియు చింత
బెత్తము, బెంచీ, నల్లసిరాబుడ్డియు, ఒక బల్లయు
ముడి బొమ్మలతని బడి సామానుల్"

అలాగే –

"అల్లుడనని నిక్కిన నా కల్లుడొకడు దాపురించి అధికారముతో
నిల్లుం జొచ్చెం నేనిపుడల్లుండనుగాను మామనై కూర్చుంటిన్-"
అని మామలను వేధించుకుతినే అల్లుళ్ళను హెచ్చరించారు.

జాషువాగారి సాహిత్యపరమైన విసుర్లలోని హాస్యం వినేవాళ్ళకి గులాబీ పరిమళంలా ఉంటుంది. పరిహసించేవాళ్ళకి గులాబీ ముల్లులా గుచ్చుకుంటుంది.

చివరగా ముక్తాయింపుమాట. అతని ఆదర్శవంతమైన జీవితం ఒక చిన్న పద్యంలో యిలాచెప్పాడు.

"నివసించుటకు చిన్న నిలయమొక్కటిదక్క
గడనసేయుటకాశపడను నేను
ఆలుబిడ్డలకునై ఆస్తిపాస్తులు గూర్చి
పెడదోవలో పాదమిడను నేను
నేనాచరించని నీతులు బోధించి
రానిరాగము తీయలేను నేను
సంసార యాత్రకు చాలినంతకుమించి
గుడ్డి గవ్వయు కోరుకోను నేను

కుల మతాలు గీచుకున్న గీతలుజొచ్చి
పంజరాన పట్టుబడను నేను
నిఖిల లోకమిట్లు నిర్ణయించిన నాకు
తిరుగులేదు విశ్వనరుడ నేను"

— విశాలాంధ్ర
(1986 జనవరి 5)

# అఖండ కవితాజ్యోతి: శ్రీపాద ఖ్యాతి

"ముగ్గురు నలుగురు నైదుగుర్మొనసి తెనుగు
బాసనిడిన భారతమును, భాగవతము,
రామచరితము నొక్కడే రాణమీఱ
తెనుగు జేసిన "శ్రీపాద-సత్త్రిబుత సేత"

అన్నారు నరసింహ అప్పారావుగారు శ్రీపాద కృష్ణమూర్తి గారిని గురించి వారి శతజయంతి ఉత్సవాలలో ఒకసారి. భారత భాగవత రామాయణాల్ని ఒక్కచేతిమీద తెనిగించిన గొప్పకవి శ్రీపాద కృష్ణశాస్త్రిమూర్తి గారు, నన్నయ్యలాట్టి అంతటివాడు భారతాంబోనిధి తుదముట్ట యీదలేకపోయేడు దానిని ముగ్గురు సాయంపట్టేరు. (నన్నయ్య. తిక్కన్న. ఎఱ్ఱన్నలు) కాని శ్రీపాద ఆ సముద్రాన్ని తానొక్కడే యీదేశాడు ఎంతో సులభముగా, వ్యాసభారతాన్ని తన ఒక్క చేతిమీద తెనుగు చేశాడు 'కృష్ణభారతం' అనే పేరుతో. కవిత్రియం వారు అంతచేసి కూడా భారతంలోని భగవద్గీత ఘట్టాన్ని వదిలేశారు. ఈయన దాన్ని కూడా వదలకుండా తెనిగించాడు. ఇక భాగవతము సంగతిచూస్తే దానిని నలుగురు సాయంపట్టేరు. (పోతన నారయ. సింగనవగైరా) కాని ఈయన ఒక్కడే దాన్ని తెనిగించేశాడు, ఈరెంటితోపాటు వాల్మీకి రామాయణాన్ని కూడా ఆంధ్రీకరించాడు. సాహిత్యంలో నిజానికి ఆయన ప్రతిభను కొలవడానికి తూనికరాళ్ళు లేవేమో అనిపిస్తుంది. ఈయన భారతానువాదం చాలవరకు మూల విధేయంగానే నడిచింది, ఒక్క రామాయణంలో మాత్రం అక్కడక్కడ మూలాతిరిక్తమైన మార్పులు, కనిపిస్తున్నాయి, ఇలాచేసిన మార్పులు తెలుగు రామాయణాల్లోనే ఎక్కువ, ఉదాహరణకి వాల్మీకి రామాయణంలోలేని లక్ష్మణరేఖ వంటి మెరుగులు రంగనాథ రామాయణంలో ఎన్నో కనుపిస్తాయి అలాగే అహల్యా

శాపఘట్టంలో కృష్ణమూర్తి శాస్త్రిగారు చేసిన మార్పు కూడా గొప్ప మెరుగు. ఈ మార్పులో స్త్రీ పవిత్రతలను చక్కగా ప్రతిపాదించారు. ఈ ఘట్టంలో వాల్మీకి రామాయణంలో

"మునివేషం సహస్రాక్షం రఘునందన
మతించకార దుర్మేధా దేవరాజు కుతూహలాన్"

అనిఉంది. అంటే ఇంద్రుని మీది కుతూహలం వల్ల దుర్బుద్ధిగల ఆహల్యసమ్మతించింది అని. ఇలా ఆహల్యజారిణిగా చిత్రించబడింది. అటువంటప్పుడు పతివ్రతల జాబితాలో అహల్యఎలానిలుస్తుంది! దీనికి శాస్త్రిగారు గౌతమ వేషమున నున్న ఇంద్రుడు అహల్య చేతిని మాత్రము తాకినట్లు. ఆమె వానిని గుర్తించి తిరస్కరించినట్లు ఆమె పాత్రను తీర్చిదిద్ది ఆహల్య పాతివ్రత్యాన్ని నిలబెట్టేరు.

ఆకలంకలో మండోదరితో రావణుడు -

"ఎరిగియె చేసితి నింతయు
ఎరుగుదు జనకాత్మజాత ఇందిరయని
నేనెరుగుదు రాముడు హరియని
ఎరుగుదు నాచావు నిక్కమేయనిగరితా"

అంటాడు - ఇదిపూర్తిగా అమూలకం. బహుశః విశేష ప్రశస్తి పొందిన కాటూరి వారి "పౌలస్త్య హృదయం" లోని భావం దీన్ని అధారం చేసుకొని వ్రాసిందేమో కూడా!

ఈయన కావ్యాలైతేనేం. నాటకాలైతేనేం. శతకాలైతేనేం. ప్రహసలనాలు. సంస్కృత గ్రంథాలు దాదాపు 260కి పైనే-చరిత్ర పుట్టిన తరువాత ఒక్క చేతిమీదుగా యింత గ్రంథసృష్టిచేసిన వారు అంతకు ముందులేరు. అందుకే సాహిత్యంలో ఆయన స్థానం unparlled, unrivalled and unique. ఈయన నాటకాలలో "బొబ్బిలి యుద్ధం" మంచి వీర రసాత్మకమైనది - పల్లెటూళ్ళలో దీనిపట్టు యిప్పటికీ గట్టిగానే ఉంది.

"చెలగడేనేడు బొబ్బిలికోట బురుజుపై
తాండ్రి పాపయ్య తళతళల బాకు"

అని యితర కవులచే వ్రాయబడ్డ పద్యాలు ఈ నాటకము చూసిన మీదట ఉద్భవించిన ఉత్తేజమే. తెలుగు పౌరుషాన్ని పాపారాయుడు వెంగళరాయుడు పాత్రలతో దేశ దేశాలకు వెదజల్లేడు. మల్లమదేవి బిడ్డను దాసికప్పగించి సహగమనము చేసే సన్నివేశము కరుణరస పోషణకు పరాకాష్ట. ఇక్కడ కంటనీరు పెట్టని ప్రేక్షకుడుండడు. ఇంతటి ప్రతిభావంతుడు గనుకనే 'మహా మహోపాధ్యాయ' "కళాప్రపూర్ణ" "కవి సార్వభౌమ" 'అభినవవ్యాస' లాంటి ఎన్నో బిరుదములు, గండపెండేర గజారోహణ సన్మానాలు. కనకాభిషేకాలు వగైరా ఎన్నో పొంది గౌరవింపబడ్డారు, 'ఏగతిరచిం రేని సమకాలము వారలు మెచ్చరేగతిన్' అనేది ఈయన పట్ల వర్తించలేదు. తనకాలంలోనే పండితుల చేతా. పామరుచేతా, ప్రభుత్వముచేతా కూడా మహోన్నతులుగా గౌరవింపబడ్డారు. 'Poets are born, not made' అనేది ఈయన సాహిత్య సృష్టిచూస్తే నిజమనిపిస్తుంది. నిజానికి యింత గొప్ప కవి తెలుగుదేశములో లేడు. అన్ని పుస్తకాలు వ్రాసిన కవి అసలు భారత దేశములోనే లేడు, భారతదేశము సంగతి అటుంచి ప్రపంచంలో నైనా ఎవరైనా ఉన్నారా అనేది కూడా అనుమానమే ఇతను వ్యక్తి గాదు, ఒక శక్తి-(శ్రీశ్రీగారు వ్యక్తికి బహువచనం శక్తి అన్నట్లు) అయితే యితన్ని ఏ కవి అనాలి? ఈ ప్రశ్న ఎందుకంటే యిప్పుడు కవులను రకరకాల పేర్లతో పిలుస్తున్నారు. మహాకవని, మామూలు కవని, బాలకవని. చమబాకవని యిలా - ఇప్పుడు ఎంతో మందిని మనం 'మహాకవి' అనేస్తున్నాం - ఆ మాటనే యీాయనకు తగిలిస్తే యీాయన వారి స్థాయికి పడిపోతాడు. కనుక ఒక మహోన్నత కవిగా పేర్కొంటే సరిపోతుందేమో.

ఈయన 'శాకుంతలం' శుద్ధాంధ్ర. నిరోష్ట్య నిరూష్య, నిర్వచన. ఏకాదశాక్షరాలలో వ్రాశాడు. అంటే గర్భ. బంధ, చిత్ర, పద

కవిత్వాలు యీయన సల్లేరుమీద బండిలా నడిపేరన్నమాట.

వ్యక్తిగా గొప్పదాత. వారియింట నిరతాన్న దానమేనట. ప్రతి పూటా పది పన్నెండు మంది పైవారు భోజనానికి లేచేవారట. వారియిల్లు నిరంతర సాహితీ చర్చల నిలయం. తాను ఎంతోమందికి అంకితాలిచ్చి సన్మానాలు పొందడమే కాకుండా తాను అంకితాలు పుచ్చుకొని ఆయాకవులను సన్మానించడం. ఎంతో మందికి ఉదారంగా సాయము చెయ్యడం ఆయనకు 'హాబీ' గా ఉండేవట. అంతటి వితరణ శీలి ఆ మహాపురుషుడు.

ఆ స్థాన కవిగా ఆంధ్ర ప్రభుత్వం గౌరవిస్తే, అఖిల భారత స్థాయిలో గొప్ప సంస్కృత పండితుడుగా రాష్ట్రపతి బాబూరాజేంద్ర ప్రసాద్ ఆనాడు అత్యున్నత సత్కారం చేశారు. తిక్కన భారతం రాసేటపుడు హరిహరదేవుడు కనిపించాడట. రామాయణంలో సుందరకాండ వ్రాసేటపుడు యీయనకు ఆంజనేయస్వామి కనిపించారట. యిన్ని గ్రంథాలు వ్రాయగల్గడం చూస్తే యీయనలో ఏదో అతీతమైనశక్తి వుండేమో అనిపిస్తుంది. మోక్షగుండంవిశ్వేశ్వరయ్యలాగ 96 సంవత్సరాలు పూర్ణాయుర్దాయముతో జ్రితికి ముక్కోటి ఏకాదశి పర్వదినాన కైవల్యం పొందిన పుణ్యాత్ముడు. యీ సహసమాసజీవి అజరామరమైన గ్రంథ సముదాయం సృష్టించి అమరుడయ్యాడు. యీ గ్రంథాలు నేటి తరానికి సులభంగా లభ్యమయ్యేలా అచ్చువేసి ప్రజలకు తక్కువ ధరలకు అందజేస్తే ఆ మహాత్మునికి తెలుగు ప్రజలు నిజమైన నివాళు లర్పించినట్లవుతుంది.

-- సమాచారం
(1985 నవంబర్ 3)

# సరళ సాహితీ చక్రవర్తి, నాళం కృష్ణారావు

నన్నయచే మడి ప్రవాళశైలితో ప్రారంభించబడి ప్రబంధ కవుల సంస్కృత పదాల కౌగిలిలో శవాకృతి దాల్చిన తెలుగు సాహిత్యంలోని తేటదనం మరల కాటూరి నాళం వగైరాల చేతుల్లో ఊపిరి పోసుకొందనేది అక్షరసత్యం. కాటూరి వారి 'తొలకరి' లో

"దినకరుడు శాంతుడై తోచె దినములింత
కురుచలయ్యెను చలిగాలి చురుకుహెచ్చె
పొలములన్ రేల గ్రుడ్డి వెన్నెలలలోన
కుప్పలన్ మూర్చు కాపులు గొంతులెత్తి
పదములన్ పాడెదొ డగిరి................"

"కోడి కూయంగనే లేచి తానమాడి
నుదుట తిరుమణియు తిరుచూర్ణము తీర్చిదిద్ది
ఒక్క కేలను తంబుర ఒక్క కేల
చిరుతలంబూని నున్నని శిరముపైని
తొలగకుండగ అక్షయపాత్ర నిలిపి
మాటి మాటికి రంగరంగా యటంచు
గడప గడపకునేగి భిక్షమ్ముగొనుచు
చేరవచ్చెను సాతాని జియ్యరడిగో

అనే సంక్రాతి జియ్యరు వర్ణన, పల్లెసీమల ప్రకృతివర్ణన నిండు తెలుగు దనాన్ని దర్శింపచేస్తాయి. అలాగే నాళం కృష్ణారావుగారి "పాలతరగలు", "మీగడ తరగలు", "తేనె చినుకులు, "గోరుముద్దలు" "వెన్నబుడగలు", "దీపావళి", "అపవాదు," "పైడిలేడి" "ముద్దు" "గోగీతము," సిరిదండ మొదలగు కావ్యఖండికలు కూడా వీనిని సూక్ష్మ పరిశీలన చేసనప్పుడు నాళం కృష్ణారావుగారి సాహిత్యాన్ని బాలసాహిత్యంతో జమకట్టడం సంకాదేమో అనిపిస్తుంది. వీనిలో బాలలు అందుకోలేని

ఖావాలెన్నో ఆవిష్కరించబడ్డాయి. చాలవి పెద్దలకుద్దేశింపబడినవే ఆనేది పాల తరగలలో ఈ క్రింది ఖండికలు పరిశీలిస్తే బోధపడుతుంది.

'అంధబాలుడు' ఖండికలో గుడ్డివాడైన మనిషి అంటున్నాడు.—

"ఎన్నరానట్టి దురవస్థ యెదియొనాకు
కల్గెనని మీరుననుగూర్చి మూల్గనేల ?
ఇట్టిదని నేను తుదిని ఊహింపరాని
కష్టమవలీల సహియింప గలనుసుమ్ము".

"కనులు గలిగిన మానవులను దినమ్ము
సలుపు దుష్కృతములనేను సలుపకుండ
పుట్టుగుడ్డిగనను బ్రహ్మ పుట్టజేసె
ననుచు పాడుచునుండు నేనవరతము.'

అనే సమాజపరమైన సూక్ష్మవ్యంగ్యం ఏబాలుని ఆలోచనకందుతుంది సమాజాన్నెరిగిన ప్రౌఢునికిదక్క!

'సందేశము' ఖండికలో చనిపోయిన బిడ్డకోసం మాతృమూర్తి వేగుచుక్క నర్థిస్తున్న వేదనా భరితమైనతీరు—

"నాదుముద్దుల కొమరుండు నన్ను విడిచి
ఏడుమాసములయ్యె తానెటకొచనియె
నింతకాలముదనుక నాచెంతరాడు
అతని విడనాడి నేనింకబ్రతుకగలనె"

"నిన్ను బోలిన వన్నెలచిన్నె లొలుకు
నోయగమువాడు చక్కనిచుక్క యతడు
చుక్కగమిలోన తానొక్క చుక్కయగుచు
ఉన్నవాడేమె చూడుమా ఒక్కసారి.''

"ఉన్నచో వేగనాతని యొద్దకీవు
చేరిమెల్లగ నడుగుమా చిన్నమాట
ఇప్పుడైనను మఱియింక నెప్పుడైన
ఇచ్చటికి వాడు క్రిమ్మఱవచ్చునేమో."

"ఆటకువచ్చుట కతని కనిష్టమైన
అటకు నన్నైన రప్పించు మంచు నను ము
వానికిటు సేయ నలవికాదేని వాని
పొంతకిలైన దోడ్కొని పొమ్మనన్ను"

అనే విషాదభరితమైన ఆక్రందన ఏ చిన్నారి హృదయం భరించ గలదు? ఇది పిల్లలకోసమే అనుకుంటే ఆనందాన్ని అందించవలసిన వయసులో ఆ పసిహృదయాలకు యిలాంటి బాధను అందించడం ధర్మంకాదు. పైగా ఈ భావాన్ని సంపూర్ణంగా ఆకళింపు చేసు కోవడం రసార్ద్ర హృదయములైన పెద్దవాళ్ళకే సాధ్యం. కాబట్టి కవి ఇది పెద్దలకే ఉద్దేశించి ఉంటాడనుకుంటాను. ఇలాంటివి ఆయన ఖండికల్లో ఎన్నో-భాషా సారళ్యం చూసి బాలసాహిత్యం అంటే ఎలా? అందుకే విమర్శకులు దీనిని సరళ సాహిత్యం అని విశ్లేషిస్తే సబబేమో! ఈ తరహా సాహిత్యాన్ని శ్రీ కృష్ణారావుగారు పుష్కలంగా పండించారు. తెలుగులో సరళసాహిత్యం అనే విషయంమీద ఎప్పు డైనా ఎవరైనా పరిశోధన చేస్తే శ్రీ కృష్ణారావుగారిదే అగ్రస్థానం.

— మంజరి
(1983 జనవరి 12)

# హరికథా రంగంలో ఆణిముత్యం

ఆనాదినుండీ ఆంధ్రదేశంలో జానపదులను విజ్ఞాన వంతులను చేసిన ప్రజా కళ హరికథ. ఇందు ఎందరో మహానుభావులు ఉద్భవించారు. వారిలో కథాగాన కళాప్రపూర్ణ, సంగీత సాహిత్య భూషణ, విద్వాన్ ములుకుట్ల సదాశివ శాస్త్రిగారు మణిపూస.

శాస్త్రి గారు మూడు దశాబ్దాలపాటు తెనాలి తాలూకా హైస్కూలులో తెలుగు పండితులుగా పనిచేసి, తర్వాత మహాలక్ష్మి గాన విద్యాలయం స్థాపించి ఎందరికో జంత్ర గాత్రములు నేర్పుతున్నారు. ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ వారిచే హరికథా గురుకులమునకు కులపతిగా నియమింపబడి సంప్రదాయ సిద్ధమైన పద్ధతిలో హరికథకులను తయారుచేస్తున్నారు ఆయన.

వీరి తండ్రి రాఘవశాస్త్రిగారు సుప్రసిద్ధ పౌరాణికులు. తల్లి వెంకట సుబ్బమ్మగారు. జననం 1915 సెప్టెంబరు 30 ఇంకొల్లు గ్రామంలో, మీమాంస విశారద మల్లావఝ్ఝల సుబ్బరామ శాస్త్రిగారి వద్ద తర్క వ్యాకరణ కావ్య నాటకాలంకారాదుల నభ్యసించారు శ్రీ సదాశివశాస్త్రి గాయక సార్వభౌమ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులు గారివద్ద. గాన విద్యాసుందరి బెంగుళూరి నాగరత్నమ్మ గారివద్ద సంగీత విద్యాభ్యాసం చేశారు. ఆదిభట్ల నారాయణ దాసుగారి ప్రియ శిష్యులు నేతి లక్ష్మీనారాయణ గారివద్ద హరికథా గానం నేర్చుకొన్నారు. వాయలీనం వాయించడంలో మంచి ప్రజ్ఞ, ఉపజ్ఞ అర్జించారు. 1855 ఏప్రిల్‌లోను, 1957 ఫిబ్రవరిలోను జాతీయ సంగీత కార్యక్రమాలలో "భక్త మార్కండేయ" కథాగానం చేసి భారత ప్రశస్తి పొందారు. 1959 సెప్టెంబరులో ఆకాశవాణిలో తూము నరసింహదాసు చరిత్రను భక్తిమార్గమనే పేర సంగీతనాటకంగా మలిచి ప్రయోక్తగా అందించడమే గాకుండా

నరసింహదాసు పాత్రనుపోషించి పలువురి ప్రశంసలు పొందారు శ్రీశాస్త్రి. భక్తిరంజనిలో వీరి దేవీస్తుతి. శివస్తుతి, మోక్షగుండ రామాయణం దుర్గాస్తవం రామదాసు కీర్తనలు వినిపించారు. శివ సంబంధమైన కథలు, ప్రత్యేకించి ద్వాదశజ్యోతిర్లింగములు చిరుతొండనంబి కన్నప్పపంచాక్షరి మహాత్మ్యం. సోమవారవ్రత ప్రభావం వంటివి, చంద్రహాస జైమినీ భారతం మోక్షగుండరామాయణం మొదలైన ఎన్నో హరికథలు రేడియో శ్రోతలకు చిరపరిచితం. అందులో భక్తజయదేవ. తరిగొండ వెంకమాంబ, రాజరాజేశ్వరి శ్రీ శాస్త్రిగారికి విశిష్ట ఖ్యాతి గడించి పెట్టినకథలు. శ్రీ శాస్త్రిగారు 1955, 57. 71 సంవత్సరాలలో బొంబాయి ఆంధ్ర సభలో త్యాగరాజ చరిత్ర కథాగానంచేసి అఖండ గౌరవాన్ని పొందారు. 1966వ సంవత్సరంలో భోపాల్ ఆంధ్ర విజ్ఞాన సమితిలో త్యాగరాజచరిత్ర చెప్పి మద్రాస్ హైకోర్టు ఛీఫ్ జస్టిస్. శ్రీ సి. చంద్రారెడ్డి గారిచే అభినవ త్యాగరాజుగా నుతింపబడ్డారు. ఆంధ్రదేశంలోనే గాక జైపూర్. లక్నో వంటి పలు ప్రాంతాలలో వీరి త్యాగరాజు చరిత్ర కథాగానాలు లెక్కకు ఏనాడో వేయి దాటాయని శ్రీబుగ్గా పాపయ్య శాస్త్రిగారు చెప్పారు.

1981లో అనంతపురంలో జరిగిన సంగీతోత్సవాలలో ఆంధ్ర ప్రదేశ్ సంగీత అకాడమీవారు గాన కళాప్రపూర్ణ బిరుదునిచ్చి బంగారు శాలువాతోసత్కరించారు. వీరి శ్రీరామదర్శనం, త్యాగరాజు, శ్రీరామ సేవ. తూము నరసింహదాసు కీర్తనలు. నామకుసుమార్చన. శ్రీరామ షోడశోపచార పూజా కీర్తనలు యల్. పి. రికార్డులుగా వచ్చాయి.

శ్రీశాస్త్రిగారికి నేడు రాజమహేంద్రవరంలో శ్రీ త్యాగరాజ నారాయణదాస సేవా సమితి 33వ ఆరాధనోత్సవాల సందర్భంగా ఇస్తున్న "సువర్ణ సుమ" బిరుదు సకల కళా సరస్వతికి రాజ మహేంద్రవరం సమర్పించుకొంటున్న మంగళ నీరాజనం.

# పఠనాసక్తిని పెంపొందించిన రాజమహేంద్రి పుస్తక ప్రదర్శన

రాజమహేంద్రి వీరేశలింగ పురమందిరంలో టౌనుహాలు ట్రస్టువారు ది. 10-2-82 నుండి 14-2-82 వరకు అయిదు రోజులు అతివైభవంగా జరిపించిన పుస్తక ప్రదర్శన దర్శించిన ప్రతివారినీ ఎంతగానో ఆకర్షించింది.

మొదటి స్టాలులో ఆంధ్రకేసరి యువజన సమితి వారిచే ఏర్పాటు చేయబడిన బాపు బొమ్మల ప్రదర్శన మంత్ర ముగ్ధుల్ని చేసింది. కళాత్మకమైన ఈ స్టాలు గేటు దాటగానే మాక్మిలన్ కంపెనీ (మద్రాసు) వారి ప్రపంచ సాహిత్య, శాస్త్ర, వైజ్ఞానిక పుస్తకాల స్టాలు, అదిదాటితే గుప్తా అండ్ కో(విశాఖ)వారి ప్రాచ్య పాశ్చాత్య పుస్తకస్టాలు, వరండాలోకొస్తే కుడి ఎడమల ఆధ్యాత్మిక వేదాంత గ్రంధములతో నిండిన శ్రీ గొల్లపూడి వీరాస్వామి అండ్ సన్స్ (రాజమండ్రి) వారి స్టాలు, భక్తిరస గ్రంథమాల (రాజమండ్రి) లక్ష్మీనారాయణ బుక్ డిపో (రాజమండ్రి) వారల స్టాల్సు - అవి చూసుకొని ముందుకెళితే రీడింగురూమ్ విభాగంలో వీరేశలింగం పుస్తక ప్రదర్శన స్టాలు. ప్రక్కకు తిరిగితే శ్రీ వి.వి.యస్. యన్ శేఖరం గారి చిత్రకళా ప్రదర్శనస్టాలు, వెనుదిరిగి ముందుకెళ్ళి కళామందిరంలో కాలుపెడితే తీర్చిదిద్దబడిన తిరుమలతిరుపతి దేవస్థానం వారి భక్తిప్రబోధక గ్రంధములతో చిత్రపటముల స్టాలు. ప్రక్కన తపాలాబిళ్ళల ప్రదర్శన, ప్రదీప్తి సహకారంతో పేరిచర్ల సూర్యనారాయణరాజుగారి అపురూప పురాతన నాణెముల ప్రదర్శన స్టాలు, అక్కడే శ్రీ పి. గోపాలకృష్ణచే ప్రత్యేక కరెన్సీనోట్ల ప్రదర్శన, ధియేటరు మెట్టుదిగగానే గౌతమీ ప్రాంతీయ గ్రంధాలయం (రాజమహేంద్రి) వారి ప్రాచీన తాళపత్ర గ్రంధములు,

తామ్ర శాసనములు, తెలుగులో తొలుదొల్త వెలువడిన పత్రికలు పరిశోధనా గ్రంథముల ప్రదర్శన స్టాలు. ఇక్కడనుండి నవలలు, నాటకములు. నాటికలు, కావ్యములు, ఇతిహాసములు, జీవితచరిత్రలు, వ్యాసములు మొదలగు ప్రాచీన నవ్య సరళికి చెందిన వేలాది గ్రంధములతో వరుసగా 'అరుణా పబ్లిషింగ్ హౌస్" విజయవాడ, "శరత్‌బుక్‌హౌస్" రాజమండ్రి 'నవజ్యోతి పబ్లికేషన్స్' విజయవాడ నవోదయాపబ్లిషర్స్" విజయవాడ. 'ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ సికిందరాబాదు 'విశాలాంధ్ర బుక్ హౌస్" విజయవాడ, "న్యూస్టూడెంట్ బుక్‌హౌస్" విజయవాడ, 'దేశీ ప్రచురణలు" విజయవాడ. డీలక్సు పబ్లికేషన్స్" విజయవాడవారి స్టాల్సు.

ఈగ్రౌండులో చివరిబుక్‌స్టాలు క్రైస్తవమత సాహిత్యంలో బైబిలుబుక్‌స్టాలు. ఆ తరువాత వరండాలో ఎడమవైపు "కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్" రాజమండ్రి వారి హిందూధర్మ ప్రబోధక పుస్తకములతో పాటు వివిధ రకములైన సాహిత్య గ్రందముల స్టాలు, కుడివైపున శ్రీ రాళ్ళబండి సుబ్బారావు గవర్నమెంటు మ్యూజియం, రాజమండ్రివారి పురావస్తు పరిశోధనా గ్రందముల స్టాలు. ఆ ప్రక్క ఎగ్జిబిషన్ కమిటీవారి వివిధ రచయితల పుస్తకముల జనరల్ స్టాలు. ఈ అయిదురోజులకూ పుస్తక విక్రయం బహుశః పాతికవే లుండవచ్చునని వేసినతొలి అంచనా అద్భుతంగా తారుమారై చివరిరోజు లెక్కలు చూసి డబ్బైవేలని తెలిసి ఆశ్చర్య మేసింది. అంతకుమించి ఈప్రదర్శనను సందర్శించినవారు దాదాపు పదివేలమంది అనేది మరో ఆశ్చర్యంకర విషయం. ఈ పుస్తక ప్రదర్శన విజయానికి యింతకంటే నిదర్శనలేం కావాలి? ఈ ప్రదర్శనలో కొన్ని పుస్తకాలకు పదిశాతం తగ్గింపురేటు ఒక ప్రత్యేకం. అందులో ప్రత్యేకంగా మహిళలకు ఒకరోజు కేటాయించబడడం (18-2-82) ఒక విశేషం. ఆ రోజు సేల్సు మరీ పెరగడం మరో విశేషం. ఈ ప్రదర్శనలో ప్రతిరోజూ సాయంత్రం రాజ

మహేంద్రి 'సాహితీవేదిక వైజ్ఞానిక సభలు. సాంస్కృతిక కార్య క్రమాలు నిర్వహించింది. పానుగంటి జయంతి, సి. ఆర్ రెడ్డి. సి. పై చింతామణి బళ్ళారి రాఘవలు శత జయంతుంత్సవాలు. వితంతు వివాహ శత వార్షికోత్సవం జరుపబడింది.

చివరిరోజు మధ్యాహ్నం పుస్తకరచయితలు. ప్రచురణకర్తలు పంపిణీదారులు. పాఠకులకో శ్రీ పున్నమరాజు నాగేశ్వరరావు శ్రీసి. వి. ఎన్. మహేష్. శ్రీమతి సావిత్రి సంచాలకులుగా గోష్ఠి నిర్వ హింపబడింది. విజయవాడ సర్వోదయ ప్రచురణ సంస్థ అధినేత శ్రీరామ్మోహనరావు సమన్వయకర్తగా అసక్తికరమైన అంశాలతో పుస్తక ప్రచురణ ప్రదర్శన. విక్రయములోని సాధకబాధకాలు. వివరంగా చర్చించి పుస్తక ప్రచురణ, డిస్ట్రిబ్యూషను. అమ్మకము అను వీనినిమొత్తంగా ఒకపరిశ్రమగా గుర్తించి ప్రభుత్వం సహాయ పడాలన్నారు. ఈసభలో సంస్కృతాంధ్ర బుక్‌డిపో (కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు)వారి ప్రచురణసంస్థకు శతవార్షికోత్సవం జరుపబడింది. బహుమతి ప్రదానానికి శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు తమ రామాయణం సెట్టు అందించగా. అది స్ఫూర్తిగా వివిధ పోటీ లలో ప్రతిరోజూ వివిధ ప్రచురణ కర్తలు తమపుస్తకాలు బహుమతు లుగా ఇవ్వడం జరిగింది.

ఉభయగోదావరి జిల్లాలలోని అనేక కాలేజీల. హైస్కూళ్ళ విద్యార్థులు తండోపతండాలుగా వచ్చి సంబరపడుతూ పుస్తకాలు కొనుక్కోవడం. అనేక గ్రంథాలయసంస్థలు తమతమ లైబ్రరీలకు గణనీయమైన సంఖ్యలో పుస్తకాలు కొనుగోలు చెయ్యడం ఈప్రద ర్శనలో కనిపించిన మరో విశేషం. తిరునాళ్ళలా సాగిపోయిన ఈ ఐదురోజుల ప్రదర్శన ఆబాల గోపాలాన్ని ఆకర్షించింది. పుస్తక విక్రేతలకూ ప్రజలకూ ఎంతో ఆనందాన్ని కలిగించిన ఈ ప్రదర్శనకు వీడ్కోలు పలకడం ఎంతో కష్టమయింది. ఇల్లాంటి

పుస్తక ప్రదర్శనను నెలకొకజిల్లాలో ఏర్పాటుచేస్తే దేశంలోని పుస్తక విక్రేతలకూ, రచయితలకూ, స్థానికప్రజలకూ ఎంతో ప్రయోజనకారి అవుతుందనేది ఎందరో వెలిబుచ్చిన అభిప్రాయం. దీనికై ప్రభుత్వం పూనుకోవడం ఎంతైనా అవసరం —

-- సమాచారం
(1982 మార్చి 8)



# విష వలయంలో నేటి మహిళ

అనాది నుంచీ అణగద్రొక్కబడుతున్న జాతులలో స్త్రీ జాతిని మొదటచెప్పాలి. వేదకాలంలో గార్గి పేరు చెప్పి, మధ్యకాలంలో ఝాన్సీ పేరు చెప్పి, ఆధునికకాలంలో దుర్గాబాయి పేరు చెప్పి స్త్రీ జాతిని గర్వించమంటారు. ఇన్ని కోట్ల ప్రజానీకంలో పైకొచ్చిన ఆడవాళ్ళ పేర్లు లెక్కిస్తే వందల మీదుంటాయేమో! దీనిని బట్టి చూస్తే స్త్రీ జాతి ఎంత పైకి వచ్చిందో తెలుస్తున్నది గదా!

ప్రాచీన కాలం నుండీ స్త్రీమూర్తిని దేవతని పేరుపెట్టి నాలుగు గోడల మధ్యా గర్భ గుడిలో బంధించేశారు. అది ఆమె అత్యున్నత స్థానం. కొన్నాళ్ళు డబ్బులు పుచ్చుకొని తల్లిదండ్రులే అమ్మేసేవారు ఎవడో ఒకడికి బజారువస్తువులాగ! అది కన్యా శుల్కం. ఇష్టమున్నా లేకున్నా వాడితో పోవలసిందే బానిసమాదిరిగా ఇప్పుడు డబ్బులిచ్చి భర్తను కొనుక్కోవలసి వస్తున్నది స్త్రీ వర కట్నరూపంలో. ఇది మరో నరకం.

భారతదేశంలో కలిగిన వాళ్ళు 20 శాతం అయితే, లేనివాళ్ళు 80 శాతం. ఉన్నవాళ్ళకు అన్ని సుఖాలూ అరచేతిలో ఉన్నాయి గనుక అటువంటి స్త్రీని గురించి మాట్లాడవలసిన అవసరంలేదు. మనం ఆలోచించవలసింది లేనివాళ్ళ తాలూకు స్త్రీ గురించి. పురుషుడు పున్నామనరకంనుంచి తప్పించేస్తాడట, అందుకని అతని పుట్టుక ఆనందం. ఈ సమాజంలో ఆడపిల్ల పుట్టగానే వినిపించే ఏడుపులు రెండు — ఒకటి, పుట్టిన పిల్ల ఏడుపు — రెండు, పిల్ల తల్లితండ్రుల ఏడుపు. ఇలా ఆమె పుట్టుకే విషాదం. పుట్టిన దగ్గర నుంచీ చూడ్డానికి వచ్చినవాళ్ళు 'అయ్యో ఆడపిల్లా!" అని బుగ్గలు నొక్కుకుంటారు అదేదో దారుణం జరిగిపోయినట్టు. పిల్ల ఎదగడం ప్రారంభమౌతుంది. చదువుకోవాలని కోరిక. 'ఇల్లే గడవనప్పుడు

పిల్లను కూడా ఎక్కడ చదివించం? అంటారు తల్లి దండ్రులు ఇంట్లో వంటకీ పెంటకీ పనిమనిషిని పెట్టుకోలేక. ఒకవేళ కష్టపడి ఏ తల్లి తండ్రులైనా చదివిస్తే ఉద్యోగాలేవీ! ఉద్యోగాలకోసం పురుషులతో స్త్రీలు సమానంగా పోటీ చేయడం అసాధ్యం. పరిమిత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో బిక్కు బిక్కుమంటూ చదివిన చదువు గనుక. అందుకే నిజంగా స్త్రీ జాతిని ఉద్ధరించాలనుకుంటే ప్రభుత్వం షెడ్యూల్డు కులాలు, వెనుకబడిన జాతుల జాబితాలో స్త్రీ జాతిని కూడా చేర్చడం అవసరం.

## పెళ్ళి చూపుల తతంగం

ఇక పెళ్ళిచూపులనాడు సంతలో బేరగాళ్ళు పశువులను నాడెం చేసినట్టే, అక్కడ పశువుల వీపుమీద పోటుకర్రతో కొట్టి అటు యిటూ నడిపిస్తారు. ఇక్కడకూడా నడిపించేతీరు అదేగాని కొట్టేది పోటుకర్రతో కాదు సూటీపోటీ మాటలతో పెళ్ళిచూపులకు ముసలివాళ్ళు కొంతమంది. పడుచువాళ్ళు కొంతమంది వస్తారు. ఇక్కడ ఎవరికి నచ్చేటట్టు నడుచుకోవాలో అర్థంకాదు. బుర్ర పైకెత్తితే ముసలివాళ్ళు పిల్లకి వినయం లేదంటారు. క్రిందికి వంచి కూర్చుంటే పడుచువాళ్ళు మొద్దు అంటారు. పాట పాడమన గానే సినిమాపాట పాడితే ముసలివాళ్ళు ముఖం ముడుచుకుంటారు. ఆధ్యాత్మిక కీర్తనలు పాడితే పడుచువాళ్ళు ముఖం దించుకుంటారు ఇదొక పెద్ద విషవలయం, ఈ గండం గడిస్తే కట్నాల బేరం వేల సంఖ్యకు తక్కువ లేనే లేదు ఎంత గతిలేని వాడికైనా. అది యివ్వగలిగితేనే పెళ్ళి. ఈ వరకట్నాలు నిషేధిస్తూ ప్రభుత్వం శాసనం చెయ్యడం బాగానేఉన్నది గానీ అసలు శాసనం చేసిన మంత్రులే వాళ్ళ పిల్లలకు కట్నం లేనిదే పెళ్ళి చెయ్యడం లేదే! అందుకే అది వట్టి "కాగితం పులి" అని అందరికి అర్థమైపోయింది. కాబట్టే బేర సారాలు బజారులో బాగానే సాగిపోతున్నాయి.

## భర్త వేధింపు, అత్త సాధింపు

ఉన్న ఇల్లూ, ఒళ్ళూ తాకట్టు పెట్టేసి పెళ్ళి అయిందనిపించేస్తారు. ఆపైన పండక్కి తీసుకువెళ్ళలేదనీ, తీసుకువెళ్ళినప్పుడు ముద్దు ముచ్చట్లు సరిగా చూడలేదని భర్త వేధింపు, అత్త సాధింపు కాపురం గంగా ప్రవేశం. పుట్టింటికొద్దామంటే అవమానం. అత్తింట వుందామంటే రంపపుకోత. గతి లేక ఏ నుయ్యో గొయ్యో చూసుకోవడం. వొంటిమీదకిరసనాయిలు పోసుకొని నిప్పంటించేసుకోవడం ఇలాంటి ఆత్మ హత్యలు, విషాద సంఘటనలు ఈనాడు ఎన్నని!

విచిత్రం! అత్తా, ఆడపడుచులనేస్త్రీలే దీనిలో ప్రధాన పాత్రలు వహిస్తున్నారనేది స్త్రీ జాతికే సిగ్గుచేటు, ఈ జాతి ఒకరిని చూసి ఒకరు అసూయపడటం, కార్పణ్యం పెంచుకోవడం మాని 'ఆమె నాలాంటి స్త్రీయే. అక్కో, చెల్లో, అమ్మో. అత్తో నా జాతే గనుక ముందు నేనే ఆమె సంక్షేమం చూడాలి' అనేదృక్పథం వస్తే స్త్రీ సమస్యలు ముప్పాతిక మూడుపాళ్ళు సమసిపోతాయి. కట్నం దగ్గర కూడా పెళ్ళికొడుకూ అతని తండ్రికంటే పెళ్ళికొడుకు తల్లి పట్టే ఎక్కువనేది సర్వత్రా వినవచ్చేమాట. నేడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దానికి పరిష్కారంగా ఆడవాళ్ళకు ఆస్తి హక్కులు కల్పిస్తామంటున్నారు. అసలు ఆస్తంటూ ఉంటేగా హక్కనేదాన్ని గూర్చి ఆలోచించడానికి! ఈ ఆస్తి హక్కుఅనేది బాగున్న వాళ్ళ గొడవ. ఈ సంస్కరణవల్ల మామూలు కుటుంబాలకు చెందిన స్త్రీకి ఒరిగేదేమీ లేదు.

పుణ్య పురుషుడు వీరేశలింగంపంతులుగారు విధవా వివాహాలు ప్రవేశ పెట్టారు. ఇది గొప్ప సంస్కరణ అని వేదికలమీద అందరు గొంతు చించుకునే వారే కాని నిజజీవితంలో ఎంతమంది ముందుకు వచ్చి వైధవ్యం పొందిన స్త్రీలను పెళ్ళి చేసుకుంటున్నారు! బహుశః

ఇన్నేళ్ళ నుంచీ జరిగినవి వేళ్ళమీద లెక్కించవచ్చునేమో! కనీసం ఆ ఉపన్యాసాలు చేసే వాళ్ళయినా వాళ్ళ ఇళ్ళల్లోని విధవ స్త్రీలకు వివాహాలు చేస్తున్నారా అనేది సందేహం!

## వర్ణాంతర వివాహాలు

ఇక కులాంతర వివాహాలు. దీన్ని గురించి అనర్గళంగా మాట్లాడే ఆదర్శవాదులే తమవాళ్ళకి చెయ్యరు. ఎక్కడన్నా జరిగితే అవి ప్రేమవివాహాలుతప్ప ఆదర్శంగా చేసుకున్నవి అతిస్వల్పం. ప్రభుత్వం ఈ వివాహాలకై ప్రకటించిన బహుమతులు ఒక నిరోధ్ పేకెట్టు, ఒక మంగళ సూత్రం. —వీనితో బ్రతుకుతెల్లవారి పోతుం దన్నట్టు! నిజానికి కులవ్యవస్థ బలపడి ప్రతి విషయం గురించి కులం ప్రాతిపదికగా ఆలోచించుకుంటున్న ఈ రోజుల్లో ఎవరైనా కులాంతరవివాహం చేసుకుంటే వాళ్ళవి కుక్కపాట్లే ఇరు కులాల లోనూ అంతరంగవెలి. బాహ్యంగా ఎవరూ ఏ అవసరానికి సహక రించక పోవడం, హేళన, దెప్పిపొడుపులు, తప్పుడు ప్రచారం, చెప్పుడుమాటలు – ఇవి వాళ్ళకి సమాజమిచ్చే బహుమతులు. ఇంకా కొందరు పనిగట్టుకొని లేనిపోనివి కల్పించి ఇద్దరినీ వేరుచేసేదాకా నిద్దరోరు. ఈ విషసమాజపువలలో ఆ పురుషుడు గానీ పడ్డాడా ఇక ఆ స్త్రీ గతి అధోగతే. సాటిస్త్రీలుకూడా సానుభూతికి బదులు అదే అదనుగా ఆమెను కాకుల్లాపొడిచేస్తారు. కాబట్టి ఇలాగ వర్ణాంతర వివాహాలు చేసుకున్న వాళ్ళకి, ఉద్యోగాల్లో రిజర్వేషనులు, గృహ నిర్మాణానికి అప్పులు, ఉపాధికల్పనా పథకాలు చూపి ప్రభుత్వం ప్రోత్సహిస్తేతప్ప కులాంతరవివాహాలు ముందుకునడవవు. అసలు ఇప్పుడు దేశంలో అన్నిఅనర్థాలకూ మూలం కులవ్యవస్థ. దీనిని కూకటివేళ్ళతో కూల్చివేయాలంటే, ప్రభుత్వం వెంటనే స్వకుల వివాహాలు నిషేధించాలి.

— కోస్తావాణి

(1983 ఆగష్టు 15)

# ఆంధ్రి భాషాసమితి

## అధ్యక్ష స్వాగతోపన్యాసం

(1871 ఆగష్టు నెలలో ఆంధ్ర విశ్వవిద్యాలయ తెలుగుశాఖ ప్రీవియస్‌విద్యార్థులకు ఫైనలు విద్యార్థులు ఏర్పాటుచేసిన స్వాగత సభలో యిచ్చిన శ్రీ రామకృష్ణారెడ్డి అధ్యక్షోపన్యాసం).

సభాయైనమః

సోదర విద్యార్థినీ విద్యార్థులారా!

ఈరోజు సుదినం. కారణం తెలుగుశాఖ గతచరిత్రలో ఎప్పుడూ ఎరగని క్రొత్తసంప్రదాయానికి మనమందరం నాందిపలుకుతున్నరోజు. ప్రీవియస్ విద్యార్థులకు ఫైనలువిద్యార్థులు స్వాగతం పలికే ప్రత్యేక కార్యక్రమం ఈనాటినుండే ప్రారంభం. మీరంతా యిలా యింత పెద్దఎత్తున పాల్గొనడం చూస్తే యీ ఒరవడి తెలుగు శాఖ చరిత్రలో తరతరాలుగా మిగిలిపోతుందనే నమ్మకం నాకు కలిగింది. చాలా ఆనందంగానూ సంతోషంగానూవుంది.

సీనియర్ జూనియర్ విద్యార్థుల సంబంధం అన్నదమ్ముల బంధం. ఎందరో తమ్ముళ్ళు, ఎందరో చెల్లెళ్ళు ఎక్కడెక్కడినుండో వచ్చారు. వాళ్ళకివాతావరణం క్రొత్త, ఇక్కడిపద్ధతులు క్రొత్త హృదయపూర్వకమైన పలకరింపు కోసం మనసు ఎంతో ఆవేదన పడుతుంది. ఆ సమయంలో సుహృద్భావ పూర్వకమైన హస్తాన్ని వారికి అందించి వారిలో ధైర్యస్థైర్యాలు పురికొల్పడం పెద్దవాళ్ళుగా సీనియర్ విద్యార్థుల కర్తవ్యం. ఆ పరమార్థమే యీనాటి స్వాగత కార్యక్రమంలోని అర్థం, ఇంతటి ఉత్సాహవంతమైన Programme Suggest చేసిన మిత్రులకు దానిని ఆమోదించి ఆచరణలో పెట్టిన

Final విద్యార్థులకు విచ్చేసిన పీవియస్ విద్యార్థులకు నా ప్రత్యేక వందనాలు.

ఈ సందర్భంలో నేను మన యూనివర్సిటీ Emblem లోని ఉపనిషద్వాక్యం గుర్తుచేయడం అవసరమనుకుంటాను. మీరంతా చూసే వుంటారు. 'తేజస్వినావధీతమస్తు" అనేది. పూర్తిశ్లోకం మీ కందరికి తెలిసేవుంటుంది.

ఓం సహనావవతు
సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు.

అంటే మనలోమనం మనకోసం మనం కలిసిబ్రతుకుదాం - కలసి తేజోవంతుల మౌదాం - అనే మహదాశయం ఇందులో యిమిడివుంది. అదే మనకు శిరోధార్యం. ఎందుకంటే మనదంతా ఒక కులం. అది లోకంలో సంకుచితంగా ఏర్పాటు చేసుకున్న బ్రాహ్మణ, రెడ్డి, కాపు. కమ్మలాంటి హేయమైన జాతిపరమైన కులంకాదు. మనిషి మేధస్సుకు సంబంధించిన కులం. విద్యావంతుల కులం. విద్యాధికుల కులం. మేధావులకులం. ఇందులో సంకుచిత భావాలకెంత మాత్రం ఆస్కారంలేదు. కులమత తత్వాలకు పేద, ధనిక తారతమ్యాలకు స్థానంలేదు. మనమంతా ఒకటి. ఒకేబాటమీద ఒకే మాటమీద ఒకేత్రాటిమీద విద్యారంగంలో విశేషమైన కృషిచేసి చరిత్రను సృష్టిద్దాం. ఉజ్వలమైన భవిష్యత్తును నిర్మించుకుందాం. అదే మనధ్యేయం అనేప్రతిజ్ఞ తీసుకోవడమే యీనాటి యీ కార్యక్రమముఖ్యోద్దేశం.

ఇకపోతే జూనియర్ విద్యార్థులకు నేను విన్నవించేదేమంటే ఈనాటిమీరు నిరుడుమేము. ఈనాటిమేము రేపటిమీరు. ఇంతకూ మన అంతరం ఒకసంవత్సరం మాత్రమే. అనంతర కాలంలో జీవితాంతం మనము నెరపిన మైత్రి మధురస్మృతులుగా మిగిలిపోవాలి.

ఒక సంవత్సరం మేము ముందుచదివినంత మాత్రంలో అధికుల మని మేము భావించడంలేదు. మీలోకూడా ఎందరో మేధావులుంటారు. బహుశః అందరూనేమో! ఇక్కడ అధికులు, అల్పులు అనే భేదం లేకుండా అందరూ చక్కని మైత్రీభావంతో మెలగాలి. మీరందరూ ఎన్నోరకాల ఊహలతో ఇక్కడికి వచ్చి వుంటారు. మీకంటే ఒకడుగు ముందు నడిచిన మీ సీనియరు విద్యార్థుల అనుభవాలను మీకుమార్గ దర్శకం చేసుకోండి. మీనిత్యజీవితంలో గాని విద్యా విషయకంగా గాని మా సంపూర్ణమైన సానుభూతి సహకారాలు మీకుంటాయి. మీరు వానిని వినియోగించుకొని కలసిపనిచేసి డిపార్టుమెంటు ప్రఖ్యాతిని అనుమోదింపజేస్తారని ఆశిస్తూ నా మాటను మన్నించి దీనిని ఏర్పాటుచేసిన ద్వితీయ కక్ష్య విద్యార్థులకు మరొకమారు నా కృతజ్ఞత తెలుపుకుంటూ సెలవుతీసుకుంటున్నా.

జై హింద్.

ఆంధ్రాయూనివర్సిటీ
(1971 ఆగష్టు)

o—o—o

# ఆంధ్ర భాషాసమితి అధ్యక్ష ప్రారంభోత్సవ ప్రసంగం

(1971 సెప్టెంబరు నెలలో జరిగిన ఆంధ్రభాషాసమితి ప్రారంభోత్సవంలో యిచ్చిన అధ్యక్షోపన్యాసం).

అధ్యక్షులకు, అధ్యాపకులకు ఆహూతులకు సోదర విద్యార్థినీ విద్యార్థులకు నా నమస్కృతులు. శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషుయే లోకానాం స్థితిమావహ న్త్యవిహతాం స్త్రీపుంస యోగోద్భవామ్. తేవేదత్రయ మూర్తయ స్త్రీ పురుషాస్సంపూజితా వస్సురైః కిభూయాసుః పురుషోత్తమాంబుజ భవశ్రీకన్ధరాశ్శ్రేయసే

ఆదికవుల ఈ మంగళాచరణముతోనే ఆంధ్ర భాషాసమితి అధ్యక్ష ప్రసంగం ఆరంభించడం ఉచితమని భావించి చదివాను

ఎందరో మహానుభావులు ఈఅధ్యక్షస్థానాన్ని అలంకరించారు, అందర్నీ అలరించారు. సంస్థకు ఎంతో కీర్తిప్రతిష్ఠలు సముపార్జించి పెట్టేరు. అలాంటి స్థానానికి నామీద ఎంతో విశ్వాసముంచి ఎన్నుకున్న విద్యార్థి మిత్రులందరికీ మొదట కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. నాకుతెలుసు నా అర్హతసంగతి దీనిని నిర్వహించడానికి కావలసిన శక్తిసామర్థ్యాలు నాలోఉన్నవి చాలా స్వల్పం. కాని మీ అందరియొక్క సహాయ సహకార సానుభూతులతో నా శక్తివంచన లేకుండా కృషిచేసి నామీదపెట్టుకున్న విశ్వాసాన్నినిలబెట్టుకోవడానికి ప్రయత్నిస్తాను. నేను యీ సంస్థకు క్రొత్తగౌరవం తేలేకపోయినా ఉన్న కీర్తిప్రతిష్ఠలకు కళంకం తేకుండా నడుచుకుంటూ మీ అభిమానాన్ని పొందడానికి కృషిచేస్తానని మాటయిస్తున్నాను.

విశాలమైన ఆంధ్ర విశ్వకళా పరిషత్సాగరానికి ఆంధ్రభాషా విభాగము ఒకమహానది. ఈ ప్రవాహంలో మునిగి పునీతులు కావా

లనే కలలతో మనమిక్కడికి వచ్చాము. ఆకలలు సఫలంకావడానికి పాఠ్యపుస్తకాల పఠనం, నిర్విరామమైన కృషి, ఈ భాషాసమితి కార్యక్రమాలు సోపానాలు పరీక్షలు Pass కావడానికి ఫస్ట్‌క్లాసులు తెచ్చుకోవడానికి కష్టపడి చదివితేచాలు. కాని ఉత్తమపౌరుడిగా తయారుచెయ్యడానికి ఈ భాషాసమితులవంటివి కూడా అవసరం. అంతేకాదు. చదివి చదివి అలసిపోయిన విద్యార్థికి ఇదిచిన్న రిలీఫ్. అలాగే జీవితంలోకూడా అనేక కష్టాలకు నష్టాలకు తట్టుకోలేక సోలిపోయే ప్రాణికికూడా యీ సాంస్కృతిక సాహిత్య కార్యక్రమాలు పెద్దరిలీఫ్. ఈ కార్యక్రమాలు మనిషిలో Esthetic sense develop చేస్తాయి. మనిషికీ మనిషికీ మధ్యనున్న కులమత రాజకీయ అడ్డుగోడలను పడగొట్టి అనుబంధాలను సృష్టిస్తాయి. సమైక్యతను సాధిస్తాయి. అసలు మన ఆంధ్రాయూనివర్సిటీ Emblemలో ముఖ్యమైన భాగమే అది.

"తేజస్వినా౽ వధీ తమస్తు")

ఈ భాసాసమితి వ్యవహారాలగురించి మాట్లాడుతూ మొన్న మన ప్రొఫెసర్‌గారన్నారు. ఈ కార్యక్రమాలు మీచేజరిపించడంలో మా వుద్దేశం మీలో ఉత్సాహాన్ని ఉత్తేజాన్ని కల్గించి రేపు దేశానికి అవసరమగు మనుషులుగా యిప్పుడే ఇక్కడే మిమ్మల్ని తీర్చిదిద్ది పంపించడం ఆశయమని, వారి మహోత్కృష్టమైన ఆశయాన్ని చేరుకోవడానికి మనం చక్కని కార్యక్రమాలు రూపొందించుకుని సమైక్యతతో నిర్వహించుకోవలసిన బాధ్యతమనమీదఉంది. అలాగని ఎల్లప్పుడూ ఇదే కార్యక్రమంలో మునిగి తేలుతుంటారేమో అని ప్రొఫెసరుగార్ని సందేహపడవద్దని మనవి చేస్తున్నాను. మీరిచ్చిన అవకాశాన్ని మే మెంతమాత్రమూ దుర్వినియోగపరచుకోకుండా తగువిధంగా మాత్రమే జరుపుకుంటామని తెలుపుకుంటున్నాను. ఈ విషయమై నేను మొదటి మీటింగ్‌లోనే మాసోదరులకు సోదరీ

ఇకభాషా విషయకంగా ఆలోచిస్తే ఇంగ్లీషు ప్రపంచవ్యాప్తంగా ప్రాకిపోయింది, హిందీ భారతదేశవ్యాప్తంగా ప్రచారం సాగుతోంది కాని ఆంధ్రభాష మాత్రం అధ్వానస్థితిలోనే వుండిపోయింది.

ఒకనాడు తెలుగుతల్లిని కీర్తిస్తూ
'బ్రహ్మదేశమ్ము నీపంటపండిన చేను
మధ్యరాష్ట్రమ్ము నీమాట చెల్లు
అస్సామునందు నీ అందంబు రాజించు"

అన్నారు. అంటే అటు అస్సాముపంటి యిటు ఆంధ్రప్రదేశ్ వరకూ విస్తరింపబడి వుండేదన్నమాట. అటువంటిది నేడు నాలుగుకోట్ల జనానికి మాత్రమే పరిమితమైపోయి మరుగుజ్జుమనిషిలా మద్రాసు మహారటా, మైసూరు, ఒరిస్సాల బోర్డర్లు దాటలేనంటోంది. దేశ భాషలలో తెలుగులెస్స ఒకనాడు. కాని ప్రచారంలేక తెలుగు less యీనాడు ఈతెలుగువెలుగుల జిలుగులు నాలుగుదేశాల్లోనూ ప్రచారం చెయ్యాలి. దానికి ఆయా విశ్వవిద్యాలయాల్లో తెలుగుశాఖలు ఏర్పాటు చెయ్యడానికి ప్రయత్నించాలి. ఇప్పుడు ప్రచారంలో వున్న విషయంచూస్తుంటే ముందుముందు తెలుగు అధ్యయనం చేసిన M. A.లకు ఉద్యోగాలు సన్నగిల్లిపోతున్నాయని అలాంటి నిస్పృహలు తెలుగు Student ఎదుర్కొనే పరిస్థితులు రాకుండా చూడవలసినదిగా పెద్దలను కోరుచున్నాను. కారణమేమిటంటే మరో Economic Student, History Student అంటే అతనికి భారతదేశంలో అన్ని యూనివర్సిటీలలోను శాఖలున్నాయి. భారతదేశం అంతా పుద్యోగాలు దొరికే అవకాశం వుంది. తెలుగుస్టూడెంటుకో! తెలుగు దేశంలోనే.

ఇక ఈతెలుగుకు Encouragement ఇవ్వడం కోసంB. A. లో S. P. L. Telugu చదివేవాళ్ళకి రు 100/- స్టయిఫండు యిస్తే అది ఎక్కువమందిని ఆకర్షిస్తుంది. ఇప్పుడు హిందీ,తమిళము వగైరాలు

ప్రచారానికి చేస్తున్న పని అదేగా! ఇప్పుడు జిల్లాస్థాయిలోను, రేపు రాష్ట్రస్థాయిలోను తెలుగును వ్యవహార భాషగా వాడదలచినారట గదా! అప్పుడు Administrative jobsలో తెలుగు M A లకు B. A Spl. Teluguవాళ్ళకు Preference వుండేటట్టు చూడడంమంచిది. ఇలాకొన్ని means ఆలోచించి feesebleగా వుండే వాటిని finalise చేసి తెలుగు సాహిత్యానికి విశేషప్రచారం కలిగించాలని పెద్దలను కోరుతున్నాను ఈ కార్యక్రమాలలోను చదువులవిషయంలోనూ మాకుఅన్నివిధాలా అండదండలుగా నిలిచిన అధ్యాపకులందంకి నా నమోవాకాలర్పిస్తూ ఎంతోఐకమత్యంతో అన్నివిదాల సహకరిస్తున్న విద్యార్థినీ విద్యార్థి సోదరులకు కృతజ్ఞత తెలుపుకుంటూ నాఉపన్యాసాన్ని ముగిస్తున్నా

శలవు.

ఆంధ్రాయూనివర్సిటీ
1971 సెప్టెంబరు

